# A DESCRIPTIVE CATALOGUE

OF THE

# TELUGU MANUSCRIPTS

IN THE

## GOVERNMENT ORIENTAL MANUSCRIPTS LIBRARY, MADRAS

BY

SYED MUHAMMAD FAZLULLAH, M.A., L.T.,

*Ex-Curator, Government Oriental Manuscripts Library, Madras.*

AND

T. CHANDRASEKHARAN, M.A., L.T.,

*Curator, Government Oriental Manuscripts Library, Madras*

*(Prepared under the orders of the Government of Madras)*

---

**Volume X — Ganita and Jyotisa**

**(D. Nos. 2274 to 2399)**

---

PRINTED BY THE SUPERINTENDENT
GOVERNMENT PRESS
MADRAS
1949

# INTRODUCTION.

The tenth volume of the Descriptive Catalogue of Telugu manuscripts is prepared on the same plan as that of the first nine volumes. The numbering and pagination of this volume are in continuation of the ninth volume and it contains descriptive notices regarding manuscripts bearing on Gaṇita (Mathematics) and Jyotiṣa (Astrology). There are no original works on these subjects written in Telugu and the works that now exist are either translations and commentaries or adaptations in Telugu of works written in Sanskrit by earlier writers. The manuscripts noticed in this volume are of this type. Attention is drawn below to some of the more important and interesting manuscripts described herein :—

## D No. 2282—SĀRASANGRAHA GAṆITAMU.

This is one of the earliest works in Telugu on Gaṇita. Mahāvīrācārya, a great preceptor of the Jain religion who lived in the middle of the ninth century A.D., wrote in Sanskrit the work known as Gaṇitasāra Saṅgraha (this work has been published with English translation and notes by Rao Bahadur M. Rangacharya, M.A., as No. 2 of the Government Oriental Manuscripts Library Series) and the work under notice is an adaptation of the Sanskrit work in Telugu by Mallana of Pāvulūru who lived about fifty years after Nannaya, author of the Telugu Mahābhārata in the eleventh century. The genealogy of the author, Mallana, is as follows :—




It was Mallana I, son of Sivvana, who obtained a grant of the village Navakhaṇḍavāda near Pīṭhikāpuram

(Pithapuram) from the Telugu King Rājarājanarendra. Mallana II, son of Sivvana and Gaurama, is the author of this work. It is also known as Daśavidhagaṇitamu and Pāvulūri Gaṇitamu. There are fourteen copies of this manuscript in the Library, but unfortunately they are all incomplete, each containing only a portion mixed up with portions of similar works by other writers. The manuscript described under D. No. 2287 contains the largest portion of the work and it will be useful in reconstructing the original work, in collation with other copies of the manuscript.

D. No. 2311—ĒSYAKĀLAJÑĀNAMU.

This is a work on astrology. It is stated in this work that at some future time there will be severe famine and diseases and other serious disturbances in the world when a semi-divine person known as Vīrabhōgavasantarāya will appear and protect all those who take shelter under him. (Vide fol. 103 and 104.) Works of this kind were also common in other languages; "Kālajñāna" in Kannada by Simhagiri Kṛṣṇamācārya who lived in 1712 A.D. also tells us about the advent of Vīrabhōgavasanta. The belief regarding this, especially among the orthodox type of people is probably based on such works. Āruvēla Vīrabhaṭlayya is the author of the work under notice. Particulars regarding his time and genealogy are not traceable.

D. No. 2364—RAṬṬAMATAMU

This is a Telugu version of the Kannada work by Raṭṭa who lived in about 1300 A.D. (Vide page 324, Karnataka Kavi Carite, Volume I). Raṭṭa was a Jain by religion and a descendant of Kādamarasa, Commander-in-Chief of Narasimha. He is stated to have written this work in the light of the systems of Gārgya, Dhana,kīrti, Haribhaṭṭi, Śrīpati, Varāhamihira, Nārāyaṇa Bhaṭṭa and the work known as Mēghamālikā. It purports to forecast the future, especially seasonal conditions useful for agriculturists by

observing certain natural phenomena. The Telugu version of this work under notice, is written in metrical form in five āsvasas by Ayyalu and Bhāskara, descendants of Ayyalarāju Tripurāntaka (author of Onṭimiṭṭaraghuvīra Śatakamu) and is dedicated to Venkaṭarāju of the Ārvīṭi family. On the basis of the stanza at the end of the work, viz.,

" శాలివాహన శకసమమి వేయునార్నూటి
తొంబది రెండు రూఢిగాగ "

It is stated that this work was written ın 1769 A.D. (Vide Andhra Kavula Carita, Volume III, page 93). But this stanza is not found ın this manuscript According to Rao Bahadur R. Narasimhachar, who quotes Bio graphical sketches of Dekkan Poets, the work was rendered into Telugu by Bhāskara ın the 15th century A.D. (Vide page 324 lives of Kannada Poets, Volume I.)

D. No. 2385—SASYĀNANDAMU.

Indications of rain, ıts quantity, etc., and several topics useful for agrıculturists are dealt with in this work. The author is Dōnayūmātya and he has dedicated the work to God Mallikārjuna worshıpped at Śriśaila in Kurnool district. According to the followıng stanza

క కరినగ దినకరశకస
వ్సరములు భువి బరగుచుంత సస్యానందం
చిర పుగ శ్రీగినాథున
కరుదుగరచినుంచె దోనయామాత్యుడిలన్.

the work was written in the Saka year 1278 corresponding to 1356 A.D.

T. CHANDRASEKHARAN,
*Curator.*

Government Oriental Manuscripts Library, Madras,
*20th October* 1948.

# CONTENTS.

# AUTHOR INDEX.

# GENERAL INDEX TO THE DESCRIPTIVE CATALOGUE OF TELUGU MANUSCRIPTS, VOLUME X.

[*Note* — The names in italics are those of the works described in this volume.]

# A DESCRIPTIVE CATALOGU

OF THE

# TELUGU MANUSCRIPTS

# VOLUME X.

---

# GANITA AND JYŌTIṢA.

---

## No 2274. ఆంధ్రబీజగణితము.

## ĀNDHRABĪJAGANITAMU.

Substance, paper. Size, $8\frac{5}{8} \times 6\frac{1}{4}$ inches. Pages, 54 Lines, 29 to 35 on a page. Character, Telugu Condition, much injured. Appearance, old. Mode of writing, illegible and not free from mistakes.

Incomplete

A work on Algebra written by Tadakamaḻḻa Venkatakrsna Rao

**Beginning :**

సీ. ఆద్యవర్ణముద్రోయి యాద్యపక్షంబున-నన్యపక్షంబున నవ్యవర్ణ
మాలను రుచంబులు ప్రియాద్యముచేత-నన్యపక్షము భక్తమైన నాద్య
వర్ణోన్నితంబగు వర్ణమొక్కటియందు-వర్ణబాహుళ్యంబు వరలుచోట
నావర్గసమాహారమటుచేసి యవ్వర్ణ-మితిని సాధింపంగ మతినెఱుంగు
మంత్యోన్నితంబున నలభాజ్యవర్ణంబు-భాజ్యంబు హారంబు భాజకంబు
రూపములు క్షేపంబు రూఢిగాఁ గల్పించి-గుట్టక విధినబ్బు గుణము భాజ్య
వర్ణమానము ఫలంబగు హారవర్ణమా-నముగాఁగ భాజ్యంబునందు వర్ణ
ములుగల్గ నమ్మానములు స్వేష్టములుచేత-గుణియించి రూపులఁ గూర్చవలయు
నా మితులచే విలోమత నన్యవర్ణ-మితులుగను ముందు మానంబు భిన్నమైన
మఱియుఁ గుట్టక మొనరింపు మచట వర్ణ-మన్యమగుదానిచే వ్యస్తమానమగును.

**End :**

ఉత్క్రమమున సమశోధనము చేయుచు ........ ............

* * * *

ఇట్లంతట క్రియోపసంహారము చేసి .. మతిమంతులచే నొక్కెడ బుద్ధిరా బీజం బొనర్చి సాధించబడుచుండును

నిగమనము.

క. హారితసగోత్రసముద్భవ, వరరంగా రాయ కృష్ణవరగణకనిచే
పగనైకవర్ణమధ్యము, హరణము సోదాహృతికత నాంధ్రం బయ్యెన్.

(వి-వి)—

అసమగ్రము. వ్రాంత మంచిదిగాదు. తెలుగుగా గుర్తింపరానిదై యున్నది. కాగితములు చాల శిథిలములుగా నున్నవి గ్రంధపాతములు అమితము

తడకపల్లి వెంకటకృష్ణ రావుగారు రచియించిన బీజగణిత మిది.

---

## No. 2275. క్షేత్రగణితము.

## KSĒTRAGANITAMU.

Substance, palm-leaf Size, 12¾ × 1⅛ inches Pages, 4 Lines, 5 on a page. Character, Telugu Condition, fair. Appearance, old. Mode of writing, not good and full of mistakes.

Begins on fol. 25*a*. The other work herein is .—1*a*. Sūtraganitamu Incomplete.

A work on Geometry by Pingali Venkaṭādri Written on the lines of the work by Pāvulūri Mallana.

**Beginning :**

క. ధాత్రిం బురాతన రచిత, క్షేత్రంబులు చూచి వానికెల్లను వేఁజా
సూత్రము చెప్పెద నంబుజ, నేత్ర సరస్వతికి మ్రొక్కి నిరుపమ భక్తిన్.

క. రవిచంద్రాది గ్రహములఁ, గవివర్యుల బుధుల నఖిల గణికోత్తములన్
బ్రవిమలభక్తి భజంపుచు, సరసయ ? గౌతమాఖ్య సంయమి గొల్తున్.

సీ. శ్రీగౌతమాన్వయ శేఖరుండైనట్టి-భవ్యశతానంద పండితుండు
సరవి పింగళివంశ జలధిశశాంకుండై-కర మొప్ప మద్వంశ కర్తయయ్యె
అట్టి యన్వయమున ననఘుండు సూరన్న-కవిసార్వభౌముండై గణనకెక్కె
నయమార్గచరితుండు నాగమంత్రీంద్రుండు-మత్పితామహుండు నమ్మహిత
యశుఁడు
ఘనతరాచార్యుఁడు ఘనుఁడు మజ్జనకుండు-గురుయుక్తి సురమంత్రి కొండమంత్రి
అమితసద్గుణశీలయగు లింగమాంబిక-జనయిత్రి సత్కీర్తి చతురపత్రి ?
దశరథానందవంశచే వరసుబుద్ధి-దనరుచున్నట్టి శ్రీవేంకటాద్రి యనఁగ
బ్రవిమలసుకీర్తి వర్తిలఁ బ్రబలుచుండు-రచన పర్ణింతు గణితంబు లక్షణంబు.

**End :**

సమచతురము నడుము మిఞ్జు వల్లంబు అయినందున సూత్రము ·—

క. నిడుపులు మూడును గూడుచు, త్రిభాగము చేసి నిల్పి వెడల్పు మూటి మూడో
భాగమున జెప్పవచ్చు, సమచతురము నడుము మిఞ్జు వల్లంబులకున్. (?)

(వి-వి.)—

అసమగ్రము. ఆరంభము అల్పభాగము సూత్రము గలదు. వ్రాంత మంచిదిగాదు. తప్పులనుయము. శైథిల్య గ్రంధపాతములు లేవు.

పింగళి వేంకటాద్రి రచించిన క్షేత్రగణిత సూత్రములు ఇందు గలవు. పావులూరి మల్లన గణితపద్ధతి ననుసరించి యీతఁడు దీని రచించెనట.

## No. 2276. గణితము (త్రైరాశికము).

## GAṆITAMU (TRAIRĀŚIKAMU)

Substance, palm-leaf. Size, $18\frac{1}{4} \times 1\frac{1}{4}$ inches Pages, 11. Lines, 5 on a page. Character, Telugu. Condition, injured Appearance, old Mode of writing, good, but not free from mistakes

Begins on fol *1b*. The other work herein is :—*7a* Sūtragaṇitamu Incomplete.

On the Rule of Three. Contains portions from Mallana's work, as well as from those of other authors

**Beginning :**

సప్తమరాశి కొఱకు.

వెడల్పు ౨, నిడివి ౧౨ ఇటువంటి వస్త్రాలు నకలు ౧౦౦ కి నీసి క్రయం గాను కొఱకు వెడల్పు 3, నిడివి ౧౫ యిటువంటి వస్త్రాలు నకలు ౮౦ కి క్రయం గ. ౧3౫.

ఇందుకు సూత్రం —

తుదనుంచి గుణకం 80, 15 ల్లు; 1200, 1200, 3, 3600, 3600, 90 లు; 324000 ఇందుకు భాగహారం నకలు 100 నుంచి 100, 12, 1200, 2, 2400 చేత భాగించగా గ. 135.

**End :**

విషమరాశ్యేకాదశ సంఖ్య.

మందం 4, పొడవు 5, వెడల్పు 6, గలరాళ్లు 8, ఆమడలు 5, గ. 10 ళ్లు, మందం 5, పొడవు 8, వెడల్పు 9, రాళ్లు 12 కి క్ర. గ 72 ఇస్తే ఆమడలు ఎన్ని.

(వి-వి.)—

ఆద్యంతములు లేవు. అసమగ్రము. వ్రాంత తిన్ననిది. తప్పులు గలవు, శైథిల్య గ్రంథపాతములు చాలఁ గలవు.

త్రైరాశిక గణిత సూత్రములును, కొన్ని లెక్కలును, వానికి గణనగాను పద్ధతులును నిందు వ్రాయఁబడినవి. పావులూరి మల్లన గణితములోనివియు, అన్యదీయములును నిందుఁ గలవు.

ఇందీ యితర గ్రంథము గలదు :—

7a సూత్రగణితము

## No. 2277. గణితము (త్రైరాశికము).

## GANITAMU (TRAIRĀŚIKAMU).

Substance, palm-leaf Size, 14⅛ × 1⅜ inches Pages, 8. Lines, 7 on a page. Character, Telugu Condition, slightly injured Appearance, old Mode of writing, not good and not free from mistakes

Incomplete.

This appears to be a portion from Sārasangraha Ganitamu

**Beginning :**

క. శ్రీవల్లభు ననవరతము, భావంబున నిల్పి ధరణిఁ బ్రఖ్యాతముగా
నే వినిపించెద గణిత, ప్రావీణ్యులు సంతసింప (రాజా నిత్యముగా ?) ?

క. ధారుణిలో లౌకికవ్యవ, హారంబులు గానఁబడును నది యెట్లనినన్
ఘోరనిశాటవనంబుల, నీరజసఖుఁ డుదయశిఖరి నిలిచిన భంగిన్.

క. విమలంబగు రాజా ని, త్యము గుణియించంగ నేర్చు నతనికి భూలో
కములోని వ్యవహారము, లమరఁగ నెప్పుడును గరతలామలకమగున్.

ఉ. పర్విన యంధకారములు వాపెడు భానుని భంగి నేగముల్
సర్వముఁ బాపు నీగణిత శాస్త్రములిట్టివి చూచినంతలో
నుర్విని గల్గు లెక్కలుపయోగ్యము సర్వము గానవచ్చు త
ద్గర్వమువిడ్చి చూచినను గామ్యఫలంబును లోకపూజ్యమున్.

వ. తత్ప్రకారంబు లెట్టిదనిన.

క. నయముగఁ దైరాశికమా, రయఁ బంచమ సప్తనవమ రాశికములు ని
శ్చయముని నాల్గువిధంబులు, న ౨ న .. స్తమిన్ననగుఁ దెలియంగన్.

**End :**

గీ. రెండువేలు పోక ప్రీతితో దుతనమ్మ-ఫలము లెక్క మూడు పాతికయును
వీస మొక్కటియును వెలయంగఁ బోకలు-మూఁడు లక్షలమ్మ మూల్యమెంత.

ఒక్కు పోకలు 2000 కి క్రయం 93 వైనం పోకలు 300000 కి లబ్ధం యెంత అంటేను. ఇది గుణించే క్రమం. కడరాశిపోకలు 300000.

(వి-వి.)—

అసమగ్రము. త్రైరాశికముకూడ అసమగ్రముగా నున్నది. ఆకులు క్రమముగా లేవు. వ్రాంత మంచిదిగాదు. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతములు గలవు.

ఇదియు సారసంగ్రహ గణితములోని భాగమగును.

---

## No. 2278. తిథిచక్రము.

## TITHICAKRAMU.

Substance, palm-leaf Size, 15¾ × 1¼ inches. Pages, 38. Lines, 7 or 8 on a page. Character, Telugu. Condition, injured Appearance, old. Mode of writing, fair, but not free from mistakes.

Incomplete.

A work which contains useful information for preparing an almanac; written by Mallikārjuna in Sanskrit. A brief commentary in Telugu is included in this.

**Beginning :**

శ్రీమత్సురాసురారాధ్యచరణాంబురుహద్వయామ్
చరాచరజగద్ధాత్రీం చండికాం ప్రణమామ్యహమ్.
సర్వ...........ర్యాణామనుజో మల్లికార్జునః
తిథిచక్రం స్ఫుటం వక్ష్యే గణకాభీష్ట సిద్ధయే
తదేవ సూర్యసిద్ధాంతసమ్మతం హి కరోమ్యహమ్
వేదవిద్యాక్ దైవవిద్యాక్ (?) ప్రతిసంస్కార భేదతః.
షష్టిరష్టాదశగుణితం
వ్యపగత సంవత్సరేణ సమ్మిశ్రమ్ ।
నవగగనాబ్ధిసమేతం
శకనృపకాలం విజానీయాత్.

టీక. 60 పెట్టి 18 గు. గత సంవత్సరాలు కలయంగూడి 409 కలయంగూడితేను శకవర్షాలౌను.

**End :**

కార్త్యేన శశిక్రాంతౌ క్వచిత్క్వచిత్ తత్త్వసంస్కృతి స్తత్ర
క్రాంతేస్సామ్యా సిద్ధేరిత్థం ప్రోవాచ రోమకో భగవాన్.
... .....కన్యాయనం ౧౩-౫౦, తులాయనం ౧౫-౪౫

(వి-వి)—

అసమగ్రము వ్రాంత చక్కనిది. తప్పులు లేవు. శైథిల్య గ్రంథపాఠము లు చాలఁ గలవు.

సంస్కృతమున మల్లికార్జునుఁడను విద్వాంసుఁడు రచించిన పంచాంగ రచనోపయోగి గ్రంథమిది. తిథిచక్రమను పేరుగల యీ గ్రంథమునకుఁ గొంత తెల్గుటీకయుఁ గలదు.

---

## No. 2279. లీలావతీ గణితము.

LĪLĀVATĪGANITAMU

Substance, paper. Size, $5\frac{1}{2} \times 8\frac{5}{8}$ inches. Pages, 351. Lines, 34 on a page. Character, Telugu Condition, fair Appearance, old. Mode of writing, not good but almost free from mistakes.

Incomplete.

This is a Telugu rendering of the Sanskrit work by Bhāskarācārya dealing with various mathematical problems. The author is Tadakamalla Venkata Krsna Rao. The work is dedicated to God Nārāyaṇa of Badari.

**Beginning :**

శా. శ్రీమద్యోగిజనాగ్రగణ్యతయు నిస్సీమప్రభావంబు భ
క్తామేయేష్టఫలప్రదాయతియుఁ దాఁ బూని నిష్కామతా
శ్రీ మీఱన్ బదరీవనాశ్రమమునన్ జెల్వొందు నారాయణ
స్వామిన్ మద్గురుపట్టభద్రు నఖిలేష్టావాప్తికై గొల్చెదన్.

సీ. గారవంబున లోకకల్పనాచాతురి-గను బొడ్డు బిడ్డనిఁ గనిన మేటి
కసుఁ గ్రొవ్విన హిరణ్యకశిపాది దనుజులఁ-దునుమాడ నలఁతియౌ దొడ్డజోదు
లలితకటాక్షంబులనె సిరుల్నిండింప-గలమానినీమణిగల గృహస్థు
తలఁచిన నిఖిల పాతకములఁ దెగటార్ప-వలఁతులౌ నామముల్గల మహాత్ముఁ
డఖిల జగముల బొజ్జలో నణఁచు వేలు-పాది నారాయణుఁడు సంతతాదరమున
నాయురారోగ్యభోగభాగ్యాదు లొసఁగి-చిత్తమిగుకొత్త మన్ను రక్షించుఁగాత !

* * * *

సీ. మధ్యందినాదిత్య మండలద్యుతిఁ బోలె-బ్రహ్మతేజంబుట్టిపడి వెలుంగ
అభ్రసంగతశరదభ్రంబువలె పైన-శుభ్రతేజము గడుఁ జూడ నొప్ప
కనులవేష్టితభృంగ గణమట్టు కెంగేల-నలినాక్షసూత్రమ్మున చలింప
పరిపూర్ణసోమబింబముఁ బోలు మోముపై-గాజతోర్ధ్వత్రిపుండ్రంబు మెఱయ
మద్గురుఁడు వేంకటాచార్యమాణి మదీయ
స్వప్నమున సన్నిధి యొనర్చి సంభ్రమమున
నెదురుపడి తోడితెచ్చి తన్మృదుపదముల
కేను మ్రొక్కిన దీవించి యిట్టులనియె.

క. విను వత్స లీలావతి, యనఁ బరగిన గణితశాస్త్రి మంత్రముగా నీ
వొనరిచి మద్గురు బదరీ, వననిలయున్నాథుఁ జేయు వాంఛిత మొదవున్.

క. అదిగాక నాకటాక్షను, నదనంతనె విదితమయిన నా శాస్త్రము మ
ద్హృదయోల్లాసము గొలుపున్, బదరీవననిలయు కరుణఁ బడయుట గొలుపున్.

క. ఒనరుపుమని యుపదేశం, బొనరించి తిరోహితత్వమొందిన నా వెం
టనె పేర్కొని కరణీయము, లొనరిచి హితవితతి కిఁ గొలువు సంతసమై.

**End :**

సీ. యాతిహీన గుణాగ కృతికృతిమూలములు-ల [illegible] [illegible]ఋకర్మము లమరునట్టి
నబుణషట్కంబు సున పూర్ణషట్కంబు-న వర్గషట్కంబు నను ద్వివిధ
మును గరణీషట్కమును గరణీమూల-షడ్విధభేదముల్ జతయొనర్ప
షట్త్రింశతంబులై జాన గుపరికర్మ-భేదంబుఁ గుట్టక వృద్ధులవిధి చూ

వర్గప్రకృతియు నామీఁద వన్నె మీఱు-చక్రవాళవిధానంబు సర్వబీజ
ములకు నుపయోగమగుఁగాన మున్నుగాఁగ-ణిత సంక్షేపలీలమై ఘణితమయ్యె.
క. గణకానందదమగుచును, గణకమనీషాభివృద్ధిఁ గడువడిఁ జేయన్
గణఁగెడు బీజమునింకిటు, ఘణితంబగు పద్యభవముల బహుచిత్రగతిన్.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత మంచిదిగాదు. తప్పులు లేవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

భాస్కరాచార్యులవారు సంస్కృతమున రచియించిన లీలావతిగణిత గ్రంథమున కిది తెలుఁగు నేఁత. తడకమళ్ల వెంకటకృష్ణరావుగారు దీనికిఁ గర్త. గ్రంథమిది బదరీనారాయణదేవున కంకితము సేయఁబడినది.

---

## No. 2280. లీలావతీగణితము.

## LĪLĀVATĪGANITAMU.

Substance, palm-leaf. Size, 16¾ × 1⅝ inches. Pages, 40. Lines, 8 on a page. Character, Telugu. Condition, much injured Appearance, very old. Mode of writing, fair, almost free from mistakes.

Incomplete.

Same work as that described under R. No 135 The author is Vallabhārya also known as Kavidēvēndra, son of Rāghava Sūri He wrote it at the instance of Bommalāta Kālaya, an officer in the Court of Acyutarāya.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత మంచిది తప్పులంతగా లేవు శైథిల్యము చాలఁ గలదు. గ్రంథపాతములు గలవు.

శ్రీ కర్ణాటాధీశ్వరులగు కృష్ణరాయలయు తత్ సోదరుఁడునగు నచ్యుతదేవరాయలయుఁ గాలమున నున్న కవిదేవేంద్రాపరనామధేయుఁడును, బ్రబోధానందగురుశిష్యుఁడును, హరిత గోత్రుఁడును, కోడూరి యెఱ్ఱయామాత్యపౌత్త్రుఁడును, రాఘవసూరిపుత్త్రుఁడునగు వల్లభార్యుఁడు దీనికిఁ గర్త. అచ్యుతరాయాస్థానోద్యోగి, బొమ్మలాట కాళయ యితత్కృతి ప్రేరకుఁడు. ఆతఁడు కుమారతాతాచార్యుని శిష్యుఁడు. ఈ గ్రంథము ఆర్. నెం 135 లోన వర్ణితము విశేషములక్కడ చూచునది.

---

## No. 2281. వేంకటేశ గణితము.

## VĒṄKAṬĒŚA GANITAMU

Substance, palm-leaf. Size, 15 × 1 inch. Pages, 34 Lines, 5 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, very old. Mode of writing, fair, but not free from mistakes

Begins on fol 1*a* The other works herein are .—19*a*. Amāvāsyā-sōmavāravratōdyāpana, etc.

Incomplete.

Similar to the work described under No. 2282 This is only about multiplication. The name, etc , of the author are not known. The work has been dedicated to God Veṅkatēśvara and hence the title of the work.

**Beginning :**

క. శ్రీ వేంకటేశ భక్తజ, నావనసంశీలయిందిరాత్మాలోలా
దేవాధిదేవ యుష్మ, త్సేవకునిఁగ బ్రోవు నన్ను స్థిరతర కరుణన్.

తే. అవధరింపుము భవదాఖ్య సంకితముఁగ-విన్నవించెద గణితంబు వేడ్కతోడ
రాశిగుణకంబు లబ్ధమేర్పడఁగఁ బద్య-ములను రహిమీఱ వేంకటాచలవిహార !

క. శరధియుగ సోమసంఖ్యలు, స్థిరముగ నిడి నాగసంఖ్యచేత గుణింపన్
గరబాణశశాంకాంకులు, పరపగ తిన్నచ్చు శేషశైలాధీశా !

వ. ఇట్లు-శరధి చతుస్సముద్రాలు 4, యుగ చతుర్యుగాలు 4, సోమ-చంద్రుడు-1, గుణం-నాగ-అష్టదిగ్గజాలు 8, లబ్ధం-కరి-చేతులు-బాణ-పంచబాణాలు 5, శశాంక చంద్రుడు , ఇందు, చంద్రుడు 1.

**End :**

వ. .... దుగ-బొట్లులనఁగా దుగ రెంటికి సంజ్ఞ, బొట్లు, సున్నలకు పేరు గనుక రెండు సున్నలు 00, ప్రొద్దునుద్దులనఁగా ప్రొద్దు-సూర్యుడు-సూర్యునికివృద్ధి-జోడు గనుక-చంద్రుడు 1.-నెలనఁగా చంద్రుడు 1, ఈ శబ్దానికి లక్ష్యం పూర్వకవి ప్రయోగం.

•(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత మంచిది. తప్పులు గలవు. శైథిల్య గ్రంథపాతములు గలవు.

ఇది డి. నెం 2282 రున వర్ణితమగు గ్రంథమును బోలినది. కాని యిందు గుణకార భాగము మాత్రమే గ్రహింపఁబడినది. కర్తను గూర్చి యేమియు తెలియఁగ రాదు. ఇది వేంకటేశ్వరాంకితము. కనుకనే యిది వేంకటేశ్వరగణితమను పేర వ్యవహృతము. పద్యముల క్రింద టిప్పణి కూడఁ గలదు.

ఇందీ గ్రంథాంతరము గలదు :—

19a. అమావాస్యా సోమవారవ్రతోద్యాపనాదికము.

## No. 2282. సారసంగ్రహ గణితము.

## SĀRASAṄGRAHAGAṆITAMU.

Substance, paper. Size, 12¼ × 8¼ inches. Pages, 38 Lines, 20 on a page. Character, Telugu Condition, fair. Appearance, old. Mode of writing, fair, but not free from mistakes

Begins on fol 78*a*. of the manuscript described under D No. 446. Incomplete.

This is a Telugu version of the Sanskrit work by Mahāvīrācārya. The work is also known as Pāvulūri Gaṇitamu. The author is Mallana, who lived at Pāvulūru For details see extracts below.

**Beginning :**

శ్లో. శ్రీకంఠం సగుణం సమస్తజగతాం కర్తారమీశం గురుం
భూతోయానలచంద్రసూర్యపవనవ్యోమాత్మమూర్తిం విభుమ్
నిత్యానందమయోపి యో గిరిజయా సార్థం ప్రజావృద్ధయే
మాయాయోగముపైతి తం శివకరం వందే శివం శ్రేయసే.

క. ప్రణమిల్లి శివున కీక్రియ, నణిమాదిగుణాస్పదునకు నభినవ సంఖ్యా
మతిదీప్తి సారసంగ్రహ, గణిత మ్మూత్రంబు దనుపఁ గణఁగతిఁ బ్రీతిన్.

శా. ఆర్యాదిగ్రహసంచరద్గ్రహణకాలాన్వేషణోపాయముల్
దర్కవ్యాకరణాగమాదిబహుశాస్త్రప్రోక్తనానార్థ సం
పర్కాభివ్యవహారముల్ భువనరూపద్వీప విస్తారముల్
దక్కింకన్ గణితప్రవృత్తి వెలిగాఁ దర్కింప డెఱింగించునే.

క. కావున గణితము తెలుఁగున, గావించెదఁ గడఁగి తిని సుకవిమల్లన గౌ
రీవల్లభచరణసరో, జావాసిత చిత్త మధుకరాత్ముఁడ జగతిన్.

క. ఇలఁగమ్మనాఁటిలోపల, విలసిల్లిన పావులూరి విభుఁడను సూత్రా
కలితాపస్తంబద్విజ, కులతిలకుఁడ వినుతగార్గ్య గోత్రోద్భవుఁడన్

ఉ. శ్రీలలనేశుఁడగ్రధరణీపశేఖరుఁడై చనురాజరాజ భూ
పాలకు చేతఁ బీఠపురపార్శ్వమునన్ నవఖండవాడయన్
ప్రోలు విభూతిసొంపెసఁగ బడసి భూరిజనస్తుతుఁడైన సత్కళా
శీలుఁడు రాజపూజితుఁడు శివ్వన పుత్త్రుఁడు మల్లఁడున్నతిన్.

ఉ. శ్రీ నిలయుండు సివ్వనయుఁ జమ్మనయున్ గుణిసూర్యదేవుఁడున్
ధీనిధిప్రోల నార్యుఁడును దేజమునన్ రవితుల్యుఁడైన యా
సూనుల నల్వురం బడసె సూరిజనస్తుత సత్యభారతీ
జ్ఞానలఁ బద్మగర్భవదనంబులు నాలుగుఁ బోలు వాలిలోన్.

క. గోత్రపవిత్రుండు సద్గుణ, పాత్రుండగు సివ్వనకును బతిహితశుభచా
రిత్రారుంధతిగౌరమ, ధాత్రీ సతి కిద్దఱకును దనయుండై జగతిన్

సీ. భాసురసంజ్ఞా ప్రపంచాధివేది (లి?) త-సకలార్థ పరికర్మ జలసమృద్ధి
భిన్నాధికార గంభీరాంతరాళంబు-గాఢప్రకీర్ణక గ్రాహవితతి
త్రైరాశికోర్మి సంతానంబు మిశ్రిత-సూత్రమణిప్రభా శోభితంబు
వర్ణితక్షేత్ర విస్తీర్ణ ప్రభావంబు-లాలితఘాత పాతాళతలము
కరణసంశ్రిత ఛాయాధికార వేల-సుఖిల విద్వత్సుజన ఘోషమనఁగఁ బర-
గణిత వారాశి సాంఖ్యాన మణిగణంబు-నుద్ధరింపంగ నజునకు నోపనగునె.

క. అయినను దమ తమ శక్త్యం బయినంత యెఱింగి చెప్ప నగు నెవ్వాఁ కెం
దయినన గాఘన సూత్రిత, మయినతదంశంబు చెప్ప నగు నిజబుద్ధిన్

* * * *

దశగణిత నిర్ణయము.

వ. మఱియు నామ్నాయంబులకుఁ బ్రణవ(ప్రాయంబునుం)? బోలె సకల గణిత సారంబులకు ప్రథమ పరికర్మంబైన గుణకారఖ్యాతి నొప్పు గుణకారంబును, భాగనిర్ణయ నిర్వర్తనంబగు భాగహారంబును, క్షేత్రగణితప్రమాణ నిర్ణయస్వరూపంబై విలసిల్లు వర్గవర్గమూలంబును, వాణిజ్య వ్యవహారపదంబై ఆయవ్యయ నిర్ణయంబులకు నాలయంబై సంకలిత వ్యుత్కలితంబులనఁ జెప్పనొప్పు నయ్యష్టాధికారంబులం గలిగిన సారసంగ్రహ గణితంబును, భిన్నవ్యవహారపదంబై భిన్నప్రశ్నల కాధారంబై యతిసూక్ష్మవికీర్ణంబైన భిన్నగణితంబును, బుద్ధికి నిలయంబై యుక్తిప్రచలనకు వశంబై సూక్ష్మవిచక్షణనిర్ణయంబైన ప్రకీర్ణగణితంబును, క్రయవిక్రయ జీవితకృషి మొదలయిన సకల లోకవ్యవహారంబుల కునికిపట్టయిన త్రైరాశిక పంచరాశిక సప్తరాశిక నవరాశిక యేకాదశరాశికంబులం గల విషమసంఖ్యాది నిర్ణయంబైన త్రైరాశిక గణితంబును, సువర్ణ రత్న రజత తామ్ర చామర కర్పూర గంధ కస్తూరికాది వస్తు క్రయ విక్రయ తులానిర్ణయ ప్రపంచమేళనంబైన మిశ్రక గణితంబును, చతురశ్రత్రికోణవృత్తధనుర్మురజా(వజ) శూర్పాకారాంతర్వృత్తకోణంబులు మొదలయిన క్షేత్రగణిత ప్రమాణనిర్ణయ వ్యవహారప్రాణంబగు క్షేత్రగణితంబును, వాపీకూపతటాక 'కృతవహిత్యాది?' వాహినీజాత వ్యవహార పరీక్షాలక్షణంబైన ఘాతగణితంబును, ప్రాసాద గోపురస్తంభచ్ఛాయావిమాన 'పలంబితదిచక్షణిచ్ఛేద?' నిర్ణయంబైన ఛాయాగణితంబును, మొదలుగాఁగల సకల గణిత సారంబెల్ల సంగ్రహింపం బడని కొంతకొంత గురూపదిష్టప్రజ్ఞావిశేషంబున బుధుల యనుగ్రహంబువలన నష్టాధికారంబులం గల్గి యాంధ్రభాషా గద్య పద్యరూపంబుల వివరించెద.

**Colophon :**

ఇది శ్రీ వీరాచార్యకృత పావులూరి మల్లనామాత్య విరచితంబైన సారసంగ్రహ గణిత శాస్త్రంబునందు సంజ్ఞాధికారము.

* * * *

" ఇది శంకరపవక మహమధుక రాయ (మాణ) పావులూరి మల్లికార్జున భట్ట ప్రణీతంబైన సారసంగ్రహ గణిత ప్రకారంబునందు గుణకార భాగహార వర్గవర్గ మూల ఘన ఘనమూల సంకలిత వ్యుత్కలితంబు (?) చెప్పబొప్పు నెనిమిది పరికర్మంబులయందు సకలాధికారంబులకు సహాయంబులై ప్రవర్తిల్లు ప్రథమ గుణకార సూత్రం బెట్టిదనిన

*  *  *  *

ఇది శ్రీ వీరాచార్యకృతో పావులూరి మల్లనార్య ప్రణీతంబైన సారసంగ్రహ గణిత శాస్త్రంబునందు ప్రథమ పరికర్మ గణితంబునందు ప్రథమ గుణకారం సమాప్తము

**End :**

ఏకాదశరాశికం

సీ. దేవాలయం బొకటి తిరముగా గట్టించ-దలచియు . . ధరణివిభుడు
నిడుపుషోడశసంఖ్య నిక్కితో వెడుపును-వేదసంఖ్య మూళ్ళ వెలయగాను
పొడుగు నేత్రసంఖ్య పొందుగా రాళ్లను-అబ్ధిసంఖ్య చేత నమరనయ్య
ఋతుసంఖ్యకోసుల దూరమిగా విలకా యు-పదహారు వరహాలు బాగుగాను
ఇట్టి విల్వ దీర్ఘ్య యెలమితో దెమ్మన్న-దెచ్చిరపుడు ప్రజలు తెల్వితోడ
సూర్యనేద . షట్ సామజంబులు-వీటి కెంత విలువ వెలయ జెపుము !

టీక, 16-4-2-4-6-16-12-4-2-6-8 ఈ క్రమంగా రాసులబెట్టి యిచ్చరాసులు 5 ద్రవ్యరాసుల దనుకా యెచ్చ గుణిస్తే 73728 అవతల ప్రమాణ రాసులు గుణించినవి 3072 ఆరాశికింద భాగిస్తే 24 వరహాలు వచ్చెను. ఈ ప్రతే వేరాతిస్తంభములు ని. 16, వెడుపు 4, పొడుగు మూళ్లు 2, ఇటువంటి రాళ్లు 4, ఆరు క్రోసులనుండి తెస్తే ధర పదహారు వరహాలు ఇస్తాం తెమ్మంటేను ఆ చోప్పున వెళ్లి చూస్తే అక్కడ లేవు గనక అవతలికి వెళ్లి నిడుపు మూళ్లు 12, వెడల్పు 4, పొ. 2, రా. 6, కోసులు 8 దింటనుంచి తెచ్చినారు గనుక వీటికి యెంతాయెనంటే 24 వరహాలు చెప్పేది.

శ్లో. యాభా ? విహారణే గుణితం
ప్రమాణేన విభాజితా
త్రైరాశిక మిదం జ్ఞేయం
గణితశాస్త్ర మిదం ఫలమ్.
త్రైరాశికం సమాప్తము.

(పి-వి.)—

అసమగ్రము. కృత్యవతరణిక, సంజ్ఞాధికారము, ప్రథమ గుణకారసూత్రము, భాగహార సూత్రము, త్రైరాశికము నిందు గలవు.

మహావీరాచార్యుడు, సంస్కృతమున రచియించిన సారసంగ్రహగణితమున కిది తెలుగు సేత దశవిధ గణితమనీ, పావులూరిగణితమనీ యిది పేర్కొనబడుచున్నది.

కమ్మనాటిలోనిదగు పావులూరు గ్రామమునకు విభుఁడు (కరిణము) ను, గార్గ్యగోత్రుఁడును నగు కవిమల్లన దీనికిఁ గర్త. అతని వంశవృక్ష మిట్టిది.




మల్లన.

ఇందు సివ్వన పుత్త్రుఁడగు మొదటి మల్లన యాంధ్ర నృపశేఖరుఁడగు రాజరాజ భూపాలకునిచే పీఠికాపురము దగ్గఱ నవఖండవాడ యను గ్రామము నగ్రహారముగాఁ బడసినవాఁడు సివ్వనకు, గౌరమకుఁ గుమారుఁడగు రెండవ మల్లన, ప్రస్తుత గ్రంథమునకుఁ గర్త. ఈ ప్రతిలో గద్యములు రెండు రెండుచోట్ల నున్నవి. రచనము గూడ భిన్నవిధముల నున్నది. పావులూరి మల్లనార్యుని రచనమున నితరులవారి రచనములు కలసి గ్రంథము తబ్బిబ్బయియుండును.

ఇందలి గ్రంథాంతరములకు డి. నెం 446 రును జూచునది.

---

## No. 2283. సారసంగ్రహగణితము.

## SĀRASAÑGRAHAGAṆITAMU.

Substance, palm-leaf Size, 18⅜ × 1½ inches Pages, 136. Lines, 6 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, not good, and not free from mistakes

Incomplete.

Contains portions from Mallana's work and also from other works on the subject

**Beginning :**

శ్లో. శ్రీకంఠం సగుణం సమస్తజగతాం కర్తారమీశం గురుం
భూతోయానలచంద్రసూర్యపవన వ్యోమాత్మమూర్తిం విభుమ్
నిత్యానందమయోఽపి యో గిరిజయా సాకం ప్రజావృద్ధయే
మాయాయోగముపైతి తం శివకరం వందే శివం శ్రేయసే.

**Colophon :**

ఇది వీరాచార్యకృత పావులూరి మల్లనామాత్య విరచితంబైన సారసంగ్రహ గణిత శాస్త్రంబునందు ప్రథమ గుణకార సూత్రములు సమాప్తము.

క. మేలుగ నెనిమిది యొక్క శి
వాలయమున కంబుజంబు లర్పించినచో
నీ లెక్క నూట నలువది
నాలుగు భువనముల కెన్ని నళిన లయ్యెన్.

* * * *

ఇది శ్రీ శంకరపదకమలమధుకరాయమాన పావులూరి మల్లికార్జున ప్రణీతంబైన గణిత శాస్త్రంబునందు సారసంగ్రహ గణితంబున ప్రథమ పరికర్మంబైన గుణకార సూత్రము సమాప్తము.

* * * *

(తర్వాత నీ క్రింది వ్రాత గలదు !) —

“ అంగీరస నామ సంవత్సరం ఆడి నెల 21 వ తేది శనివారంవరకు శ్రీమతు వెంకటాచలశాస్త్రి పుత్రుడైన విశ్వేశ్వరుడు స్వహస్తంగా స్వంతానకు వ్రాసుకొన్న పావులూరి గణితశాస్త్రం సంపూర్ణం. ”

* * * *

“ సారసంగ్రహ గణిత శాస్త్రంబునందు తృతీయవర్గు. ”

క. “ తొమ్మిది సున్నయు నాలును, నిమ్మహిలో నొకటిఁ బెట్టి యిందులలోనన్
నెమ్మిఁ బ్రభవాదిఁ గూడిన, సమ్మతముగఁ జెప్పవచ్చు శకవర్షంబుల్. ”

* * * *

క ధాత్రిఁ బురాతన రచిత, క్షేత్రంబులు చూచి వాని కెల్లను నోజా
సూత్రము చెప్పెద నంబుజ, నేత్ర సరస్వతికి మ్రొక్కి నిరుపమభక్తిన్.

* * * *

ఇది శంకరపదకమలమధుకరాయమాణ మల్లికార్జున ప్రణీతంబైన దశవిధ గణిత ప్రోక్తంబునందు షష్ఠక్షేత్ర గణితము.

క. (ధారుణి)ని బూర్వకల్పిత, మారంగాఁ జూచి హేయ నందులసారం
బాగయ వర్ణించెద నే, నేరుపుతో హరుని దలఁచి నిరుపమభక్తిన్.

వ. అందు షష్ఠక్షేత్రగణితంబు చెప్పిన తదనంతరంబు సప్తమఖాత గణితంబు సెప్పెద నది యెట్టిదనిన.

**End :**

గిరి నయనముల నెత్తి గెల్చిన్న లబ్ధంబు
కానులుగా నెంచిగొనిన యట్లు
క్రోలి యడుగు భావి కోటికట్టులు దీర్ప
సూక్ష్మఘనములకు సూత్రమిదియె.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత మంచిదిగాదు. తప్పులున్నవి. శైథిల్యము గ్రంథపాతములు గలవు ఇందు క్షేత్రఘాతాది గణితములకు రేఖావిన్యాసముతో లక్ష్యములు చిత్రింపఁబడినవి.

పావులూరి మల్లన సారసంగ్రహ గణిత భాగములతో నితరులు రచించిన గ్రంథ భాగములు నిందుఁ జేరియున్నవి అట్లనుటకు దాహరణగా నిందుదాహృతమగు పద్య మొకటి శాలివాహనశక సంఖ్యాగణనార్థమయినది పదునేడవ శతాబ్దికి సరిపడ దగినది కలదు.

---

## No. 2284. సారసంగ్రహగణితము.

## SĀRASAṄGRAHAGAṆITAMU.

Substance, palm-leaf Size, $15\frac{3}{4} \times 1\frac{3}{8}$ inches Pages, 22. Lines, 6 on a page. Character, Telugu Condition, slightly injured Appearance, old. Mode of writing, fair but not free from mistakes.

Begins on fol 1*a* The other work herein is :—12*a* Sūtragaṇitamu Incomplete.

Written by Pāvulūri Mallana Contains only the rules of multiplication

**Beginning :**

శ్లో. శ్రీకంఠం సగుణం సమస్తజగతాం కర్తారమీశం గురుం

* * * *

క. గోత్రపవిత్రుఁడ సద్గుణ, పాత్రుండగు శివ్వనకును బతిహితశుభచా

రిత్రారుంధతి గౌరమ, ధాత్రీ సతి కిర్వురకును దనయుఁడ జగతిన్.

**End :**

గీ. తురగ గగనేందుదిగ్గజతోయజారి-కరశరక్షితిహిమకరగతులనిల్పి

అగ్నిసంఖ్యఁ బెంచి యమరంగఁ జెప్పుమా-గణక తిలక మాకుఁ గ్రమముతోడ.

గుణకం 3, వచ్చు 4115218107.

**Colophon :**

ఇది శ్రీ వీరాచార్యకృత పావులూరి మల్లనార్యప్రణీతంబైన సారసంగ్రహ గణిత శాస్త్రంబునందు ప్రథమ పరికర్మ గణితంబునందు ప్రథమ గుణకారం సమాప్తము

(వి-వి)—

అసమగ్రము. వ్రాఁత మంచిది. తప్పులున్నవి. శైథిల్యము లేదు. గ్రంథ పాతములు లేవు.

పరికర్మ గణితమని, అష్టాధికార గణితమని పేర్కొనఁబడు ప్రథమ గణితమున గుణకారాధికారము మాత్ర మిందుఁ గలదు. ఇది పావులూరి మల్లన రచనము.

ఇందలి యితర గ్రంథము గలదు :—

12a సూత్రగణితము.

## No. 2285. సారసంగ్రహగణితము.

## SĀRASAṄGRAHAGAṆITAMU.

Substance, palm-leaf Size, $15\frac{1}{8} \times 1\frac{3}{8}$ inches Pages, 7. Lines, 4 or 5 on a page. Character, Telugu Condition, injured Appearance, old. Mode of writing, fair but not free from mistakes

Begins on fol 20*b* of the manuscript D. No. 2298

Incomplete.

Contains only a small portion of Mallana's work dealing with additions

**Beginning :**

క అందకుగ భాగ్యమానము క్రిందను దభ్యాగహారము గ్రిడ్వడసిడి త
ద్భ్రుందసదృశోపవర్తన వందివ నది యయ్యె భాగహారం బిలలోకా

**Colophon :**

ఇది వీరాచార్యకృత పావలూరి మల్లనామాత్య నిర్మితంబైన సారసంగ్రహగణితంబు నందు ద్వితీయ భాగహారము సమాప్తము.

అందు ద్వితీయ పరికర్మకరణసూత్రం బెట్టిదనిన.

**End :**

ఆ. మూఁడు వేలమీఁద మున్నూట ముప్పది
మూఁడు గలయఁగూడి ముదముతోడ
నిలిపి దాని వర్గు వలయక కొని కన్న
ఫలము చెప్పు గణక తిలక మాకు. వర్గు ॥3333॥ లబ్ధం॥ ౧౧౧౦౮౮౮౯.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత మంచిది. తప్పులున్నవి. శైథిల్యము గలదు. గ్రంథ పాతములు గలవు.

పావులూరి మల్లన సారసంగ్రహ గణితమున ప్రథమ పరికర్మ గణిత భాగమున నేకదేశము.

ఇందలి గ్రంథాంతరమును డి. నెం 2298 రున జూచునది.

---

## No. 2286. సారసంగ్రహగణితము.

## SĀRASAṄGRAHAGAṆITAMU.

Substance, palm-leaf Size, $14\frac{1}{2} \times 1\frac{3}{8}$ inches. Pages, 78. Lines, 6 on a page Character, Telugu Condition, slightly injured. Appearance, old. Mode of writing, fair but not free from mistakes.

Incomplete.

Similar to the work described under D. No. 2283.

**Beginning :**

శ్లో॥ శ్రీకంఠం సగుణం సమస్తజగతాం కర్తారమీశం గురుం
భూతోయానలచంద్రసూర్యపవన వ్యోమాత్మమూర్తిం విభుమ్
నిత్యానందమనూపి గౌరీగిరిజయా సాకం ప్రజావృద్ధయే
మాయాయోగము పైతి తం శివకరం వందే శివం శ్రేయసే.

* * * *

వ. విను వినుతింపం బూనిన గణితచంద్రికయందు గణితసూత్రక్రమం బెట్టిదనిన, సంజ్ఞాధికారంబును గుణకార భాగహార వర్గవర్గమూల ఘనఘనమూల సంకలితవ్యుత్కలితంబులను సారసంగ్రహంబు అష్టాధికారగణితంబును త్రైరాశిక పంచరాశిక సప్తరాశిక నవరాశిక యేకాదశరాశికం బాదిగాగల బేసిరాసులును మఱియు నానావినోద విగ్రహంబులు గల లెక్కలు సమగ్రంబుగా గల్గి లోకవ్యవహారంబులు దెలుప కరతలామలకంబై యుండు తత్క్రమంబు వర్ణించెద.

క. నానా శాస్త్రంబులలో-నానార్థము లెఱుఁగువాని నానాగతులన్
నానా లెక్కలు నిలిపెద-భూనుతముగ గణితమందు బుధసమ్మతిగన్.

**Colophon :**

ఇది శ్రీ వీరాచార్యకృత పావులూరి మల్లనామాత్య విరచితంబైన సారసంగ్రహ గణిత శాస్త్రంబునందు షష్ఠ పరికర్మణ ఘనమూలసూత్రం సమాప్తము

**End :**

శంకరపదకమల మధుకరాయమాణ మల్లికార్జున ప్రణీతంబైన సారసంగ్రహ గణిత శాస్త్రంబునందు అష్టమ పరికర్మణ ఉత్కలితసూత్రంబును అష్టాధికారసర్వంబును సంపూర్ణము.

(వి-వి.)—

ఆసమగ్రము వ్రాంత మంచిదే. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతములు గలవు.

ఇది డి. నెం 2283 రున వర్ణిత గ్రంథమువంటిదే

గ్రంథాంత మందీ వ్రాంత గలదు :—

"విక్రమనామ సంవత్సర కార్తిక శు 10 సోమవారంవర్కు అష్టాధికార గణితం సంపూర్ణంగా పున వేరిలో మూజేటి సర్వేశలింగం వ్రాసుకొన్నెను."

---

## No. 2287. సారసంగ్రహగణితము.

SĀRASAṄGRAHAGAṆITAMU

Substance, palm-leaf Size, $12\frac{3}{4} \times 1\frac{1}{4}$ inches. Pages, 210. Lines, 5 on a page. Character, Telugu. Condition, injured. Appearance, very old. Mode of writing, good but not free from mistakes.

Incomplete.

This contains, for the most part, portions taken from Mallana's work and will be useful in reconstructing Mallana's work.

**Beginning :**

క. ధాత్రిఁ బురాతన రచిత క్షేత్రంబులు సూచి వాని కెల్లను దోడా
సూత్రములఁ జెప్పెద నంబుజ నేత్ర సరస్వతికి మ్రొక్కి నిరుపమభక్తిన్.

వ. అందు పంచమ మిశ్రిత గణితంబు చెప్పెదఁ దదనంతరంబ షష్ఠవ్యవహారక్షేత్ర గణితంబు చెప్పునది యెట్టిదనిన.

క. శ్రీకరముగ భూగణితము చేకొని కలచేల ఫలము చెలువలరంగాఁ
లోకములోఁ బ్రఖ్యాతిగఁ గైకొని వినిపింతు నెల్ల గణకులు మెచ్చన్.

**End :**

సీ. పంచమిభావంబు పద్మంబులకు నేఁగెఁ గరిభాగ మేఁగెను గలువలకును
అవతారభాగంబు నంబరంబున కేఁగె వింశతిభాగంబు విరులకేఁగె
వార్ధిభాగంబు దావనముల విలసిల్లె షట్పదములు పదునొకంటి సంఖ్యమిగిలె
అదిసమూహంబు మొదలెన్ని యనఘ చెపుమ ?

(వి-వి.)—

అసమగ్రము. ఇందు క్షేత్రగణితము (అసమగ్రము), ప్రకీర్ణగణితము, సూత్రగణితము (అసమగ్రము), భిన్నగణితము (అసమగ్రము), మరొక ప్రతి సూత్రగణితము (అసమగ్రము), సువర్ణగణితము (అసమగ్రము), మఱియొక ప్రతి సువర్ణగణితము (అసమగ్రము) మఱికొన్ని గణిత పద్యములు గలవు. వ్రాఁత చక్కనిది. తప్పులంతగా లేవు. శైథిల్యము గలదు. గ్రంథపాతములు గలవు.

ఇది చాలవఱకు పావులూరి మల్లన రచనమనఁదగినది. ఇందలి పద్యములలోఁ గొన్నింట దాక్షారామభీమేశ్వరస్వామి పేరు గలదు. మల్లన గ్రంథమును సరిగా నుద్ధరించుటకీ ప్రతి చాల నుపయోగపడగలదు. ఇతర రచనములును నిందుఁ గలసినవి.

---

## No. 2288. సారసంగ్రహగణితము.

### SĀRASAṄGRAHAGAṆITAMU.

Substance, palm-leaf. Size, 16 × 1¼ inches. Pages, 10. Lines, 7 on a page. Character, Telugu. Condition, slightly injured. Appearance, old. Mode of writing, fair but not free from mistakes.

Similar to the work described under D. No. 2283.

**Beginning :**

శ్లో॥ శ్రీకంఠం సగుణం సమస్తజగతాం కర్తారమీశం గురుం
భూతోయానలచంద్రసూర్యపవన వ్యోమాత్మమూర్తిం విభుమ్
నిత్యానందమయోపి గౌరి గిరిజయా సాకం ప్రజావృద్ధయే
మాయాయోగము పైతి తం శివకరం వందే శివం శ్రేయసే.

* * * *

వ. విను వినుతింపం బూనిన గణితచంద్రికయందు గణితసూత్రక్రమం బెట్టిదనిన, సంజ్ఞాధికారంబును గుణకార భాగహార వర్గవర్గమూల ఘనఘనమూల సంకలితవ్యుత్కలితంబులను సారసంగ్రహంబు అష్టాధికారగణితంబును త్రైరాశిక పంచరాశిక సప్తరాశిక నవరాశిక యేకాదశరాశికం బాదిగాగల బేసిరాసులును మఱియు నానావినోద విగ్రహంబులు గల లెక్కలు సమగ్రంబుగా గలిగి లోకవ్యవహారంబులు దెలుప కరతలామలకంబై యుండు తత్క్రమంబు వర్ణించెద.

క. నానా శాస్త్రంబులలో - నానార్థము లెఱుఁగువాని నానాగతులన్
నానా లెక్కలు నిలిపెద - భూనుతముగ గణితమందు బుధసమ్మతిగన్.

**Colophon :**

ఇది శ్రీ వీరాచార్యకృత పావులూరి మల్లనామాత్య విరచితంబైన సారసంగ్రహ గణిత శాస్త్రంబునందు షష్ఠ పరికర్మణ ఘనమూలసూత్రం సమాప్తము

**End :**

శంకరపదకమల మధుకరాయమాణ మల్లికార్జున ప్రణీతంబైన సారసంగ్రహ గణిత శాస్త్రంబునందు అష్టమ పరికర్మణ ఉత్కలితసూత్రంబును అష్టాధికారసర్వంబును సంపూర్ణము.

(వి-వి.)—

ఆసమగ్రము వ్రాఁత మంచిదే. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాఠములు గలవు.

ఇది డి. నెం 2283 రున వర్ణిత గ్రంథమువంటిదే

గ్రంథాంత మందీ వ్రాఁత గలదు :—

"విక్రమనామ సంవత్సర కార్తిక శు 10 సోమవారంవర్కు అష్టాధికార గణితం సంపూర్ణంగా పుదువేరిలో చూజేటి సర్వేశలింగం వ్రాసుకొనెను."

---

## No. 2287. సారసంగ్రహగణితము.

### SĀRASAṄGRAHAGAṆITAMU

Substance, palm-leaf Size, $12\frac{3}{4} \times 1\frac{1}{4}$ inches. Pages, 210. Lines, 5 on a page. Character, Telugu. Condition, injured. Appearance, very old. Mode of writing, good but not free from mistakes.

## No. 2289. సారసంగ్రహగణితము.

## SĀRASAṄGRAHAGAṆITAMU.

Substance, palm-leaf. Size, $16\frac{3}{4} \times 1\frac{1}{2}$ inches. Pages, 192. Lines, 5 to 7 on a page. Character, Telugu. Condition, injured. Appearance, very old. Mode of writing, fair but not free from mistakes.

Incomplete.

Same work as that described under D. No. 2282.

**Beginning :**

గీ. శశిపయోధివేద జలనిధిరసతర్క గుణరసంబులకును గొనుదుగాఁగ
శశిరసేషుశోమశైల గమ చంద్రుల ............ .....

**Colophon :**

ఇది శ్రీ వీరాచార్యకృతౌ పావులూరి మల్లనామాత్య విరచితే సారసంగ్రహ గణిత శాస్త్రే అష్టమ వ్యుత్కలిత స్సమాప్తః.

*    *    *    *

శ్రీకాంతనిర్మల మనోర్చిత పాదపద్మం
విశ్వోద్భవస్థితిలయాది విధాన హేతుమ్
సత్త్వద్గుణత్రయవశాత్ప్రవిభక్తమూర్తిం
సర్వజ్ఞ మీశ్వరమహం ప్రణమామి భక్త్యా!

అందు ప్రథమ పరికర్మగణితంబు చెప్పెద.

ఇది శ్రీ శంకరపదకమలమధుకరాయమాణమానస మల్లికార్జున ప్రణీతంబైన దశ గణిత ప్రోక్తంబునందు తృతీయ భిన్నగణితం సమాప్తము.

*    *    *    *

ఇది శ్రీ శంకరపదకమలమధుకరాయమాణ మల్లికార్జున ప్రణీతంబైన దశగణిత ప్రోక్తంబునందు చతుర్థ త్రైరాశిక గణితం సమాప్తం.

*    *    *    *

క. ధాత్రిఁ బురాతన రచిత - క్షేత్రంబులు సూచి వాని కెల్లను నోజా
సూత్రము చెప్పెద నంబుజ - నేత్ర సరస్వతికి మ్రొక్కి నిరుపమభక్తిన్.

వ. అందు పంచమమిశ్రగణితంబు చెప్పిన తదనంతరంబ షష్ఠక్షేత్రగణితంబు చెప్పెద నది యెట్టిదనిన.

క. శ్రీకరముగ భూగణితము - చేకొని కలచేలఫలము చెలువలరంగాఁ
లోకములోఁ బ్రఖ్యాతిగఁ - గైకొని వినిపింతు నెల్ల గణకులు మెచ్చన్.

ఘడ ప్రమాణ సూత్రము.

*    *    *    *

క. ధారుణికిఁ బూర్వగణితము – లారయఁగాఁ జూచి వేడ్క నందుల సారం
బారయఁ దగ వర్ణించెద - నేరుపుతో హరునిఁ దలఁచి నిరుపమభక్తిన్.

వ. అందు షష్ఠక్షేత్రగణితంబు చెప్పెద.

**Colophon :**

ఇది శ్రీ శంకరపదకమలమధుకరాయమాణ మల్లికార్జున ప్రణీతంబైన దశగణిత ప్రోక్తంబునందు సప్తమఖాత గణితం సమాప్తము.

* * * *

ఇది శ్రీ శంకర............ - దశగణితప్రోక్తంబునందు అష్టమచ్ఛాయా గణితము.

* * * *

క. ధారుణిని బూర్వకల్పిత, మారయఁగాఁ జూచి స్వర్ణ మరుదుగ నెందున్
భోరున హరునిని గౌరిని, నేరుపుతోఁ దలఁచి మ్రొక్కి నిరుపమభక్తిన్.

వ. అందు అష్టమచ్ఛాయాగణితంబు చెప్పి, తదనంతరంబు నవమసువర్ణ గణితంబు చెప్పుదు నది యెట్టిదనిన.

**End :**

ఉ. చిన్నములందు వన్నియలచేత గుణించి వరాకునిన్ని య
న్వన్నియలంబు రెంటులనవారణఁ బెంచి వరాకురూక తె
న్నన్నిటఁ జాలుచేసి తగనందుల లబ్ధము దాని క్రిందటన్
జెన్నుగఁ బెట్టి పాల్కొనినఁ జేకొను లబ్ధము రూకలేర్పడున్.

**Colophon :**

ఇది శ్రీ శంకరపదకమలమధుకరాయమాణ మల్లికార్జున ప్రణీతంబైన దశగణిత ప్రోక్తంబునందు నవమసువర్ణ గణితము.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత మంచిది. తప్పులున్నవి. శైథిల్యము చాలఁ గలదు. గ్రంథపాతములు గలవు. ఇది చాలఁ బ్రాచీనపుఁ బ్రతి. ఇందు (1) ప్రథమ పరికర్మగణితమును (ఇందు 12 పత్రములు పోయినవి), (2) భిన్నగణితమును, (3) ప్రకీర్ణగణితమును, (4) త్రైరాశికగణితమును (49 నుండి 60 దాక పత్రములు పోయినవిగాన 5 వ మిశ్రగణితము లేదు), (6) క్షేత్రగణితమును, (7) ఖాతగణితమును, (8) ఛాయాగణితమును, (9) సువర్ణగణితమును గలవు.

ఇది పావులూరి మల్లన రచించిన సారసంగ్రహగణితమే. ఇందు ఇతర రచనములు గూడఁ జేరియున్నట్లున్నది. ఇది డి. నెం 2282 రున వర్ణితమయినదే.

## No. 2290. సారసంగ్రహగణితము.

(క్షేత్రగణితము.)

## SĀRASAṄGRAHAGAṆITAMU.

Substance, palm-leaf. Size, 14 × 1⅛ inches. Pages, 42. Lines, 5 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, very old. Mode of writing, fair but not free from mistakes.

Incomplete.

Same work as the above.

(వి-వి.)—

అసమగ్రము. ఆద్యంతములు లేవు. క్షేత్రగణితమున కొంత భాగము మాత్రము గలదు. అదికూడ ఆనుపూర్వితప్పి తునాతునుకలయిన కొన్ని యాకులతో నున్నది. అన్ని యాకులలో క్షేత్రస్వరూపములుగూడ చిత్రింపఁబడినవి

పూర్వమువలె.

---

## No. 2291. సారసంగ్రహ గణితము.

## SĀRASAṄGRAHAGAṆITAMU.

Substance, paper. Size, 13⅜ × 8 inches. Pages, 91. Lines, 24 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, not good and not free from mistakes.

Begins on fol. 1*a* of the manuscript described under D. No. 532.

Incomplete.

Same work as the above.

(వి-వి.)—

అసమగ్రము. (1) పరికర్మగణితము (అసమగ్రము)ను, (2) భిన్నగణితమును, (3) ప్రకీర్ణగణితమును, (4) త్రైరాశికగణితమును, (6) క్షేత్రగణితమును, (7) ఘాతగణితము (అసమగ్రము)ను, (8) ఛాయాగణితము, (9) సువర్ణగణితము నిందుఁ గలవు. వ్రాఁత మంచిదికాదు. తప్పులమయము. అస్పష్టమును. మాతృక ఈ పుస్తకశాలలోనిది డి. నెం 2289 రు గలది. అది యెంతో దీనికంటె నుపయోగార్హము. శైథిల్యము గలదు. గ్రంథపాతములు చాలఁ గలవు.

పూర్వమువలె.

---

## No. 2292. సారసంగ్రహగణితము.

## SĀRASAṄGRAHAGAṆITAMU.

Substance, palm-leaf. Size, 16½ × 1⅜ inches. Pages, 38 Lines, 4 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, fair but not free from mistakes.

Begins on fol. 1*a*. The other work herein is 20*a* Saṅgītavisayamu.

Incomplete.

(వి-వి.)—

అసమగ్రము. ప్రథమ పరికర్మగణితమందలి ప్రథమ గుణకారాధికారము మాత్రము గలదు. వ్రాంత చక్కనిది. తప్పులు గలవు. శైథిల్యము గలదు. గ్రంథపాతములు గలవు.

పూర్వమువోలె.

ఇందు గ్రంథాంతరము గలదు :—

20వ సంగీత విషయము.

---

## No. 2293. సారసంగ్రహగణితము.

## SĀRASAṄGRAHAGAṆITAMU.

Substance, palm-leaf. Size, 13⅝ × 1⅝ inches. Pages, 38. Lines, 5 or 6 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, fair but not free from mistakes.

Incomplete.

Same work as that described under D. No. 2282.

(వి-వి.)—

అసమగ్రము. ఇందు ప్రథమాధికారమేని తుద ముట్టలేదు. వ్రాంత మంచిది. తప్పులు గలవు. శైథిల్యము గలదు. గ్రంథపాతములు గలవు.

పూర్వమువోలె.

గ్రంథాంతమందీ వ్రాంత గలదు :—

"ఆత్మకూరి తమ్మయ్యగారి గణితము."

---

## No. 2294. సారసంగ్రహగణితము.

## SĀRASAṄGRAHAGAṆITAMU.

Substance, palm-leaf. Size, 16⅝ × 1½ inches. Pages, 117. Lines, 8 to 9 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode o fwriting, not good and full of mistakes.

Incomplete.

Same work as the above.

**Beginning :**

క. అందముగ భాజ్యమానము-క్రిందను దద్భాగహారము కీడ్వడనిడి త
ద్వ్యత్యసదృశాపవర్తన-నొందిన నది భాగహారయుక్తఫలంబౌ.

ఉదాహరణ.

క. ఎనిమిది వేలును నూఱును-నైనయఁగఁ దొంబదియు రెండు హేమంబులు చే
కొని యేఱువది నలువురకును-ఘనముగ నంపొకని కెన్ని గణిత విధిజ్ఞా !

**End :**

సీ. ప్రతాపరుద్రుని పట్నంబునకువచ్చి-పట్టుమలగలవీడు పరుగ విడిచె

*　*　*　*

మగల సంఖ్య యెంత మఱిమాడ లవి యెన్ని
తేటపడఁగ మాకుఁ దెల్పుమనిన
గణిత మెఱిఁగినట్టి కరణాలఁ బిలిపించి
యడుగవలయు దేవ యవధరింపు.

(వి-వి.)—

అసమగ్రము. భిన్నగణితము, ప్రకీర్ణగణితము, క్షేత్రగణితము నిందుఁ గలవు. వ్రాఁత మంచిదిగాదు. చాలఁ దప్పులు గలవు. శైథిల్యము చాలఁ గలదు. గ్రంథపాతములు అమితముగాఁ గలవు. గ్రంథము కొంతదాఁక సరిగాఁ గలదు గాని మీఁద దురుద్ధరము.

ఇందు పావులూరి మల్లన రచనము, ఇతర రచనములు కలసియున్నవి.

పూర్వమువోలె.

---

## No. 2295. సారసంగ్రహగణితము.

## SĀRASAṄGRAHAGAṆITAMU.

Substance, palm-leaf. Size, 16¾ × 1¼ inches. Pages, 60. Lines, 4 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, fair but not free from mistakes.

Incomplete.

Same work as the above.

**Beginning :**

శ్రీకంఠం సగుణం సమస్తజగతాం కర్తారమీశం గురుం
భూతోయానలచంద్రసూర్యపవన వ్యోమాత్మమూర్తిం విభుమ్
నిత్యానందమయోపి యో గిరిజయా సాకం ప్రజావృద్ధయే
మాయాయోగము పైతి తం శివకరం వందే శివం శ్రేయసే.

*　*　*　*

**Colophon :**

ఇతి శ్రీ వీరాచార్యకృతౌ పావులూరి మల్లనామాత్య విరచితంబైన సారసంగ్రహ గణిత శాస్త్రంబునందు సంజ్ఞాధికారము సమాప్తము.

*　*　*　*

ఇది శ్రీ వీరాచార్యకృతౌ పావులూరి మల్లనార్య ప్రణీతంబైన సారసంగ్రహ గణిత శాస్త్రంబునందు ప్రథమ పరికర్మ గణితంబునందు ప్రథమ గుణకారం సమాప్తము.

క. శ్రీ దామోదర విన్నప-మాదరణముగోడఁ జిత్తగింపఁగదయ్యా
మోదముతోఁ ద్రైరాశిక-నీ దయతోఁ జెప్పెదయ్య నిందితహృదయా (?)

**End :**

ఈ ప్రతే వేరాతి స్తంభములు ని. 16, వెడల్పు 4, పొడుగు మూళ్లు 2, ఇటు వంటి రాళ్లు 4 ఆఱు క్రోసులనుండి తెస్తే పదహారువరహాలు ఇస్తాం తెమ్మంటేను, ఆ చొప్పున వెళ్లిచూస్తే అక్కడ లేవు గనక అవతలికి వెళ్లి నిడుపు మూళ్లు 12, వెడల్పు 4, పొ. 2, రా. 6 క్రోసులు పదింటనుండి తెచ్చినారు గనుక వీటికి యెంతాయెనంటే 24 వరహాలు చెప్పేది.

శ్లో. యిూభా? విహారణేగుణితం
ప్రమాణేన విభాగితా
త్రైరాశిక మిదం జ్ఞేయం
గణితశాస్త్ర మిదం ఫలమ్.

(వి-వి.)—

అసమగ్రము. ఇందు ప్రథమ గుణకారాధికార పర్యంతము పరికర్మ గణితమును, త్రైరాశిక గణితమును గలవు. వ్రాఁత తిన్ననిదే కాని చాలఁ దప్పులు గలవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు. పూర్వమువోలె.

పావులూరి మల్లన రచనము కొంత ఇతర రచనములు గొన్ని కలసియున్నట్లున్నవి.

---

## No. 2296. సూత్రగణితము.

## SŪTRAGAṆITAMU.

Substance, palm-leaf. Size, 16 × 1¼ inches. Pages, 27. Lines, 5 or 6 on a page. Character, Telugu. Condition, slightly injured. Appearance, old. Mode of writing, fair but not free from mistakes.

Begins on fol 1*a*. The other works herein are :—15*a*. Sūtragaṇitamu, 28*b* Jyōtiṣavisayamu, 34*a*. Bhrṅgapañcakamu, 35*b* Trairāśikagaṇitamu.

Incomplete.

A work on mathematics containing portions from Mallana's work and other mathematical works.

**Beginning :**

క. నయమునఁ ద్రైరాశిక మా-రయఁ బంచమ సప్త నవమ రాశికములు ని
శ్చయముని నాల్గువిధంబులు-నయి వెలయు సమస్తజనము లభినుతి సేయన్.

వ. నాల్గువిధంబుల రాశికాలకు నేకసూత్రము.

క. ఇరవుగ నిచ్చలు ధనమును-నరుదారఁగఁ బెంచి మఱియు నాదులు వరుసన్
వెరవొప్పఁ బెంచి యొత్తఁగఁ-బురశరగిరి నిధుల ఫలము పొలుపుగ వచ్చున్.

**End :**

సీ. ఖర్జూరఫలములు గణికుండు కొనితెచ్చి-సగపాలు మోహంపు సతికినిచ్చె

* * * *

తనయు కెన్ని యిచ్చెఁ దడయక తల్లికి-నాలుగెట్టులర్యో నయముతోడ
గణిత మెఱిఁగినట్టి కరణాలఁ బిలిపించి-యడుగవలయు దేవ యవధరింపు.

వ. ఇందుకు సూత్రము.

వ. మొదలు చెప్పిన యంశలు ఒద్దుగా నిల్పి 2, 4, 8 తల్లికి నిచ్చినవి దృశ్యము ఫలాలు 4 మొదలు చెప్పిన పాళ్లు గుణకం చేసేది.

* * * *

ఈ రెండు మూల రాశిలో భాగించగా మిగిలిన శేషం ఫలాలు కొని తెచ్చినది 288 కి—

| | |
|---|---|
| పెండ్లాని కిచ్చినది | 144 |
| తమ్ముని కిచ్చినది | 72 |
| ఆయన భార్యకు | 36 |
| కొమారునికి | 32 |
| తల్లికి | 4 |
| | 288 |

(వి-వి.)—

ఆద్యంతములు లేవు. వ్రాఁత తిన్ననిది. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతములు లేవు.

త్రైరాశిక, ప్రకీర్ణక, ఛాయాగణిత సంబంధములగు సూత్రములు, లక్ష్యములు మొదలగునవి గలవు. పావులూరి మల్లన కృతిలోని భాగములు అన్యదీయములు నిందుఁ గూడియుండును.

ఇందలి గ్రంథాంతరములు :—

15a సూత్రగణితము, 28b జ్యోతిషవిషయము, 35b త్రైరాశికగణితము.

---

## No. 2297. సూత్రగణితము.

## SŪTRAGAṆITAMU.

Substance, palm-leaf. Size, $12\frac{3}{4} \times 1\frac{1}{8}$ inches. Pages, 45. Lines, 4 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, fair but full of mistakes.

(వి-వి.)—

ఈ సమగ్రము. వ్రాంత రెండు తెలుంగులది. మంచిది. శైథిల్యము గలదు. గ్రంథ పాతములు గలవు.

జాతకచంద్రిక శ్లోకములు, కొన్ని సారావళీ శ్లోకములు నిందుc గలవు. వానికిc టీక కలదు. తొలుత వ్రాసిన జాతకచంద్రికా శ్లోకములే మరలc దుదిని రెండు పత్రములలో టీకతో వ్రాయcబడినవి.

---

## No. 2333. జాతకచంద్రిక టీక.

## JĀTAKACANDRIKATĪKA.

Substance, palm-leaf. Size, 17¾ × 1½ inches. Pages, 23. Lines, 6 on a page. Character, Telugu, Condition, fair Appearance, old. Mode of writing, fair but not free from mistakes

Begins on fol 12*a* of the ms. D. No. 2335.

Complete.

Same work as the above.

(వి-వి.)—

సమగ్రము వ్రాంత తిన్ననిదే శైథిల్య గ్రంథపాతము లేవు.

పూర్వమునోలె.

ఇందలి యితర గ్రంథములను గి. నెం 2335 ను జూచునది.

---

## No. 2334. జాతకచంద్రిక.

## JĀTAKACANDRIKA.

Substance, palm-leaf. Size, 14½ × 1¼ inches. Pages, 8. Lines, 6 on a page. Character, Telugu. Condition, very much injured. Appearance, old. Mode of writing, fair but not free from mistakes.

Incomplete.

Same work as that described under No 13682 of the Sanskrit Descriptive Catalogue, Volume 24, under the title Jātakacandrika.

**Beginning :**

సిద్ధాంతమాపనిషదం శుద్ధాంతం పరమేష్ఠినః
శోణాధరం మహః కించి ద్వీణాధర ముపాస్మహే.

ఫలాని నక్షత్రదశాః ప్రకారేణ వివృణ్మహే
వయం పారాశరీం హోరాం మనుస్మృత్య యథామతి.

* * * *

సింహలగ్నానకు.

రాహిణేయ సితౌ పాపౌ కుజజీవౌ శుభావహౌ
ప్రభవే ద్యోగమాత్రేణ నశుభం గురుశుక్రయోః.

* * * *

**End :**

కర్కటలగ్నానకు.

భార్గవేందు సుతౌ పాపౌ భూసుతాంగీ రసౌ శుభౌ
వికవివభవేత్స్వాత్ ...... ........

(వి-వి.)—

అసమగ్రము. వ్రాంత మంచిదే. శైథిల్య గ్రంథపాతము లమితములు.

ఇది సంస్కృతమున జాతకచంద్రికయను నామాంతరముతో వర్ణింపఁబడినదే. సంస్కృతమున డి. నెం 13682 రను జూచునది.

---

## No. 2335. జాతకచంద్రిక.

## JĀTAKACANDRIKA.

Substance, palm-leaf. Size, 17¾ × 1½ inches. Pages, 21. Lines, 7 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, fair but not free from mistakes.

Begins on fol. 1*a*. The other works herein are 12*a* Jātaka candrika with ṭīka 24*a*. Sarvatōbhadracakramu with ṭīka.

Incomplete.

Same work as the above.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాంత తిన్ననిదే. శైథిల్య గ్రంథపాతములు లేవు పూర్వమువోలె.

ఇందీ యితర గ్రంథములున్నవి :—

12a జాతకచంద్రిక టీక, 24*a* సర్వతోభద్రచక్రము (సటీకము).

---

## No. 2336. జాతకాలంకారము.

## JĀTAKĀLAṄKĀRAMU.

Substance, palm-leaf. Size, 14 × 1½ inches. Pages, 20. Lines, 4 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, not good and not free from mistakes.

Begins on fol. 42*a* of the ms. described under D. No. 2317.

Complete.

On the forecasting of events by the position of planets.

**Beginning :**

సవ్యాపసవ్యనక్షత్రాలు.

అశ్వి పునర్వసూ హస్తా మూలా ప్రోష్ఠపదాని చ
అంశకాత్రికేణయోన్మేషా త్ప్రాదక్షిణ్యం క్రమేణ తు.
రోహిణీ మఖ విశాఖా చ వైష్ణవీ చ క్రమేణ తు
వృశ్చికాదీని శాపాంతం అపసవ్యమితి క్రమాత్.

* * * *

**End :**

సూర్యునికి తూర్పు, శుక్రునికి ఆగ్నేయం, కుజునకు దక్షిణం, రాహునకు నైర్‌ృతి. శనికి పడమర, చంద్రునికి వాయవ్యం, బుధునికి ఉత్తరం, బృహస్పతికి యీశాన్యం ఈ క్రమాన ఫలం చెప్పేది. పాపగ్రహములు శుభగ్రహములు దెలిసి చెప్పేది. ఆదిత్యాది నవగ్రహములున్ను ఉపగ్రహములున్ను ఏకాదశ స్థానఫలములున్ను ఇచ్చి రక్షింతురుగాక ! జాతకాలంకారం అరవములో .................లో వచన పూర్వకముగా వ్రాసినది గనుక అది తెనుగు భాషను వచనపూర్వకముగా వ్రాస్తిని. శుభమస్తు.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత మంచిదికాదు. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతములు గలవు.

సవ్యాపసవ్య నక్షత్రములు, గ్రహావస్థలు మున్నగు ననేక జ్యోతిష విషయములిందు వివరింపఁబడియున్నవి. ఈ వచనరచన మెవరిదో తెలియరాదు.

గ్రంథాంతమున నైదాకులలో నష్టకవర్గు విధాయకమున్నది.

---

## No. 2337. జ్యోతిషరత్నాకరము.

### JYŌTIṢARATNĀKARAMU.

Substance, palm-leaf. Size, 16¼ × 1¼ inches. Pages, 224. Lines, 5 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, old. Mode of writing, fair but not free from mistakes.

Begins on fol. 1-a The other work herein is 113*a*. Kālacakramu.

Complete.

Same work as that described under R. No. 266*a*. The author's name is Honnayya.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పులు గలవు. శైథిల్యము చాలఁ గలదు. గ్రంథపాతములు అత్యధికముగాఁ గలవు.

ఇది ఆర్. నెం 266a రున వర్ణితము *కర్త హొన్నయ్య.

ఇందలి గ్రంథాంతరమిది :—

113a కాలచక్రమ్.

---

## No. 2338. జ్యోతిషరత్నాకరము.

## JYŌTIṢARATNĀKARAMU

Substance, palm-leaf Size, $14\frac{1}{8} \times 1\frac{3}{8}$ inches. Pages, 99. Lines, 5 or 6 on a page. Character, Telugu. Condition, slightly injured. Appearance, old. Mode of writing, fair but not free from mistakes.

Begins on fol. 57*b* of the ms. D. No. 2369.

Incomplete.

This is the same work as that described under R No 908 Author's name is Honnayya.

(వి-వి.)—

అసమగ్రము మూఁడాశ్వాసములే గలవు. వ్రాఁత మంచిదే. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతములు లేవు.

ఇది ఆర్. నెం 908 రున వర్ణితమైనదే కర్త హొన్నయ్య.

---

## No. 2339. జ్యోతిషరత్నాకరము.

## JYŌTISARATNĀKARAMU.

Substance, palm-leaf. Size, $14 \times 1\frac{1}{4}$ inches Pages, 242. Lines, 5 on a page. Character, Telugu. Condition, slightly injured Appearance, old. Mode of writing, not bad but not free from mistakes.

Complete

Same work as the above.

Author's name is Honnayya.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిదే. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతములు గలవు.

పూర్వమువలె.

## No. 2340. జ్యోతిషరత్నాకరము.

### JYŌTISARATNĀKARAMU

Substance, palm-leaf Size, 17¾ × 1½ inches Pages, 38 Lines, 6 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old Mode of writing, fair but not free from mistakes.

Begins on fol 15*a* of the ms. D. No. 2386.

Incomplete.

Same work as the above.

(వి-వి.)—

అసమగ్రము. నాల్గవ యాశ్వాసము మాత్రము గలదు. కర్త పెద్దన్నయ్య. వ్రాంత మంచిదే తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతములు లేవు.

పూర్వమువోలె.

ఇందలి గ్రంథాంతరమును డి నెం 2386 రున జూచునది.

---

## No. 2341. జ్యోతిషవిషయము.

### JYŌTIṢAVIṢAYAMU.

Substance, palm-leaf Size, 15½ × 1¼ inches. Pages, 54. Lines, 6 on a page. Character, Telugu. Condition, slightly injured. Appearance, old. Mode of writing, fair but not free from mistakes.

Begins on fol. 1*a*. The other work herein is 27*a*. Jātakacandrika-tīka.

Complete.

This is on the preparation of horoscopes according to the name of the individual and on fixing suitable time for any function.

**Beginning :**

చూచేచోలా అశ్విని, లీలూలేలో భరణ్యపి

* * * *

**End :**

నష్ట ధన ప్రశ్నకు.

రాహుర్వా రవిసూనుర్వా భానుర్వా భూమిజోపివా
లగ్నత్రిపంచసప్తాఖ్యాః కుర్యుర్నష్ట ధనాగమమ్ ॥
తత్ప్రశ్నలగ్నే రవిజీవభూమా తృతీయసప్తా నవపంచ మేషు
పురుషేషు గర్భం మునయోవదంతి అన్యగ్రహైః స్త్రీసుతగర్భజాతమ్.
అజహరిధన్వీ శార్యవిలంబం మకర సువృశ్చిక కర్కటునాశమ్

కన్యామీనే మిథునే శీఘ్రం వృషతులకుంభే సిద్ధిం కుర్యాత్॥ ఇవి ప్రశ్నకు శ్లోకాలు.

చిత్తా స్వాతి విశాఖాయాం శ్రావణ్యాం చ ప్రవర్షతి
సర్వధాన్యం పరిత్యజ్య అవశ్యం రత్నసంగ్రహం.
చిత్తా స్వాతి విశాఖాయాం శ్రావణ్యాం న ప్రవర్షతి
సర్వరత్నం పరిత్యజ్య అవశ్యం ధాన్యసంగ్రహః.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత మంచిది. తప్పులున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

నామనక్షత్రములుచూచు విధము ఇంక ననేక విధములయిన శుభాశుభసమయముల నిర్ణయములు, నవగ్రహములు ద్వాదశరాసులలో నెక్కడెక్కడున్న నేమేమి ఫలములో అవియును ప్రశ్నఫలములు నిందుఁ గలవు.

ఇందలి గ్రంథాంతరము :—

27*a* జాతకచంద్రిక టీక.

## No. 2342. జ్యోతిషవిషయము.

### JYŌTISAVIṢAYAMU.

**Substance, palm-leaf. Size $15\frac{3}{8} \times 1\frac{1}{4}$ inches. Pages, 90. Lines, 6 on a page. Character, Telugu. Condition, slightly injured. Appearance, old. Mode of writing, fair but not free from mistakes.**

Complete.

This is a compilation from other astrological works. It deals, among other topics of astrology, with auspicious and inauspicious days for any religious function.

**Beginning :**

అథాతస్సం ప్రవక్ష్యామి చక్రం త్రైలోక్యదీపకమ్
విఖ్యాతం సర్వతోభద్రం సద్యః ప్రత్యయకారకమ్.
ఊర్ధ్వగాదశవిన్యస్య తిర్యగ్రే ఖాస్తథైవ చ
ఏకాశీతి పదం చక్రం జ్ఞాయతే నాత్ర సంశయః.
అకారాదిస్వరాః కోణే ఈశాన్యాది విధయః క్రమాత్?
సృష్టిమార్గేణ జ్ఞాతవ్యం షోడశం చతురస్రకమ్.

* * * *

నందతిథియందు ఆదిత్యమంగళవారాలు వ్రాసేది. భద్రతిథియందు సోమబుధవారాలు వ్రాసేది. జయతిథియందు గురువారం వ్రాసేది. రిక్తతిథియందు శుక్రవారం వ్రాసేది.

* * * *

**End :**

ధనిష్ఠార్ధం శతభిష పూర్వాభాద్రాత్రయః కుంభం
పూర్వాభాద్రాపాదం ఉత్తరాభాద్రా రేవత్యాంతం మీనం.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత మంచిది. తప్పులున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

ప్రశ్నముచూచు విధానము ప్రయాణాదుల శుభాశుభ తిథివారాదుల పరిజ్ఞానము మొదలగు జ్యోతిషవిషయ శ్లోకములు గొన్ని యిందు గలవు. తెలుంగు టీకయు గలదు.

---

## No. 2343. జ్యోతిష విషయము.

## JYŌTIṢAVIṢAYAMU.

Substance, palm-leaf. Size, 13½ × 1½ inches. Pages, 22. Lines, 6 or 7 on a page. Character, Telugu. Condition, slightly injured. Appearance, old. Mode of writing, fair but not free from mistakes.

Incomplete.

This explains the effects of the position of planets in a horoscope.

**Beginning :**

తారాబలాష్టకం.

జన్మనక్షత్రమారభ్య నిత్యనక్షత్రగణ్యతే
నవసంఖ్యాహరేద్భాగం తారాబలమిదం శ్రుతమ్.

టీక. జన్మనక్షత్రం మొదలుకొని నిత్యనక్షత్రందాకా లెఖచేసి తొమ్మిదింట భాగించి మిగిలినవి తారాబలం తెలియవలయును.

**End :**

అనేకరోగసంయుక్తో మలినో మానవిగ్రహః
నిర్ధనశ్చపలో ధీరో యో జాతో మందవాసరే.

టీక. శనివారంనాడు పుట్టిన పురుషుండు అనేక రోగములు గలవాండును, మాసిన వస్త్రాలు కట్టుకునేవాండున్ను, అభిమానం గలవాండున్ను, చపలుండున్ను దరిద్రుండు నవును.

(వి-వి. )—

అసమగ్రము. వ్రాంత తిన్ననిదే. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతములు లేవు.

తారాబలము, తారాధిపతులవలని ఫలము, నిత్యగ్రహఫలము, రజస్వలా విషయము మున్నగు జ్యోతిష విషయములను దెల్పు శ్లోకములును వానికిం దెనుంగు టీకయు నిందు గలవు. కర్తపేరు తెలియరాదు.

## No. 2344 జ్యోతిష విషయము.

## JYŌTISAVISAYAMU

Substance, palm-leaf. Size, 13 × 1½ inches Pages, 17. Lines, 5 on a page. Character, Telugu, Condition, much injured. Appearance, very old. Mode of writing, fair but not free from mistakes.

Incomplete.

Similar to the above.

**Beginning :**

మీనమేష చతుష్పాదా వృషకుంభచతుస్త్రిభా
కన్యాపంచ తులాకుంచ పంచార్ధే ధనుకర్కటే.
వృశ్చికే మకరేసింహే మిధునే పంచపాదయోః

మీనమేషాలు ౪౹, వృషభకుంభ రాసులు ౪౺, కన్యాతులలు ౫, ధనుస్సు కర్కటం ౫౺, వృశ్చిక మకరసింహ మీథునములు ౫౹.

* * * *

**End :**

జన్మరాశియందు చంద్రుడుండినా అన్నవృద్ధి ... .......ద్రవ్య లాభము ౪.

* * * *

దేవోథవోథిగోభిహో తవేరామాభిద్రకమాత్ .

అంతు బిందువులు ౩౩౭.

(వి వి.)—

అసమగ్రము. వ్రాంత తిన్ననిదే. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతము లున్నవి.

రాశ్యధిపతులు, ఉచ్చనీచగ్రహములు, గ్రహదృష్టిమైత్రులు, తారాబలచంద్రబల లక్షణములు మున్నగు జ్యోతిష విషయములిందుఁ గలవు. కర్తపేరెఱుఁగరాదు.

---

## No. 2345. జ్యోతిష విషయము

## JYŌTIṢAVIṢAYAMU.

Substance, palm-leaf. Size, 16 × 1½ inches. Pages, 9. Lines, 6 on a page. Character, Telugu. Condition, slightly injured Appearance, old. Mode of writing, fair but not free from mistakes.

Begins on fol. 28*b* of the ms desciibed under D. No. 2296.

Incomplete.

Describes the relation of the planets to each other, their influence, etc. The author is not known.

**Beginning :**

ఇన్ని ఘడియల పొద్దు అయినదని చెప్పేటందుకు.

గీ. తననీడయడుగులు తప్పక రెట్టించి
రుద్రసంఖ్యబెట్టి రూఢి గల్పి
యున్నాటపది ............ .....
.................. . యెన్నవచ్చు

* * * *

తుమ్ములకు, బల్లిపల్కులకు అష్టదిక్కులకు చూచుకునేటందుకు.

* * * *

**End :**

ఆగ్నేయమూల యెపుడున్ను యే గ్రహం ఉండేదిలేదు. గనుక ఆగ్నేయమూలా తుమ్మినా బల్లి పల్కినా మంచి పల్కు అని చెప్పేది. దీనికి ఫలం. పద్యం—అది పాడుమూల గనుక.

గీ పాడుమూల బల్క భయమింతయును లేదు
పానశయనగమన వర్జితంబు
వత్తురన్నవారు వత్తురు వేగమే
...........................

(వి-వి.)—

అసమగ్రము. వ్రాంత తిన్ననిదే. తప్పులున్నవి. శైథిల్య గంథపాతములు లేవు.

రాహుకాల తారాబల చంద్రబల లక్షణములు బల్లిపలుకులకు తుమ్ములకు ఫలములు మున్నగు విషయములిందు గలవు. కర్తపేరెఱుంగ రాదు.

---

## No. 2346. జ్యోతిష విషయము.

## JYŌTIṢAVIṢAYAMU.

Substance, paper. Size, 8 × 4¾ inches. Pages, 39. Lines, 25 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, not good and not free from mistakes.

Begins on fol. 1*a*. The other work herein is :—A portion of Daivajñavilāsa and Bhāsyakārajātaka.

Incomplete.

A few topics on astrology are dealt with in this Ms.

**Beginning :**

ఎర్లాది మేషసంక్రాంతికి కలిదినం పెట్టి అందులో కుజాది గ్రహములకు ఘటికాదిగా చెప్పిఉండే ఖండములు తీసివేసి అందుకు ధ్రువాలు హ్రస్వాంతం ఋణమున్ను,

దీర్ఘాంతం ధనకున్న అని గుఱుతు వుంచుకుని ఖండశేషం క్రిందనుండే హారకములతో హరిస్తూ వచ్చి దానికిన్ని ధ్రువాలు ధనర్ణం యేర్పఱుచుకొని కడాపట పరిష్క వాక్యాలచేత హరించి శేషవినాడులను వుంచుకోనేది.

* * * *

**End :**

శుక్లనామ సంవత్సర చైత్ర శుద్ధ ౧ లు, కలిగతం ౪౯౭౦ కి ౧౮౧౫౩౩౪ ౧౯ ౨ ౧౧, ౫౨ ౯ ౧౦.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాంత మంచిదిగాదు. తప్పులు లేవు శైథిల్యము లేదు. గ్రం పాఠములు లేవు

పాదచారగుణితసూత్రమనీ, కలిదినానయనసూత్రమనీ, జ్యోతిష సిద్ధాంత విషయ ములు ఇందు వ్రాయఁబడినవి. అంకెల పధకములును గలవు.

గ్రంథాంతమున తలక్రిందుగా దైవజ్ఞవిలాసమను సంస్కృతగ్రంథములోని విషయ ముల సూచికయు, శ్రీ భాష్యకారుల జాతకమును గలవు.

---

## No. 2347 తారణ సంవత్సర పంచాంగము.

## TĀRANA SAMVATSARA PAÑCĀṄGAMU.

**Substance, palm-leaf. Size, 19 × 1¼ inches Pages, 64. Lines, 5 on a page Character, Telugu. Condition, slightly injured. Appearance, old. Mod of writing, fair but not free from mistakes.**

Complete.

A Calendar for the year Tārana corresponding to Śaka 1746 (182 A D )

**Beginning :**

శ్రీమద్గౌరీసుతం సర్వకార్యేష్వబ్జభవాదయః
యం ప్రణమ్య కృతార్థాస్స్యుస్తం వందే ద్విరదాననం.

* * *

శ్రీపీఠాఖ్యపురేశానం గౌరీదేవ్యా సమన్వితం
కుక్కుటేశమహం వందే భక్తాభీష్టప్రదాయకం.
ఆంధ్రాఖ్యే సముభూత్సమృద్ధవిభవే దేశే శుభే పావనే
దుర్గం రాజమహేంద్రనామపరమం కైలాసశృంగోపమం
తత్రాసీత్కవికోటిభిః కృతపదః పోల్నాడు సీమావర
స్తస్మి తలకావిరాజతిపురీ శ్రీ పీఠికాఖ్యాశుభా.
స్థిత్వా తత్ర పురే విచిత్రవిభవే విద్వత్సమూహాశ్రితే
జ్యోతిశ్శాస్త్రవిశారదైః కవివరైస్సంసేవ్యమానే శుభే

నీతిజ్ఞో బలసంయుతో గుణనిధి శ్శ్రీరావువంశోద్భవః
శ్రీమాఙ్ఖ్యా సతి గాం స్వధర్మనిరతో నీలాద్రిరాయప్రభుః॥
శ్రీపీఠాఖ్య పురస్య దక్షిణదిశి శ్రీభీమనాథస్య చ
ప్రాచ్యాముజ్జ్వల పాలనాడువిషయే ప్రారాజదుర్వీబుధైః
శ్రౌతస్మార్త విచారచారుధిషణై శ్శ్రీభావనారాయణ
క్షేత్రం సర్వపురం పునర్విజయతే శ్రేయోభిరుచ్చైస్తరాం॥
శ్రీమచ్ఛ్రీకులవంశజో రఘుపతే ర్భక్తాగ్రగణ్యోద్భవః
భారద్వాజకులాంబుధౌ విధునిభ శ్శ్రీకృష్ణనామా బుధః
పుత్త్రస్తస్య దయానిధి శ్శ్రుతియుత శ్శాస్త్రేషు పారం గతః
సీతారామ ఇతి ప్రసిద్ధవిభవ శ్శ్రీభానుతంత్రేఽభవత్ ॥
తస్యానుజో జ్యోతిషశాస్త్రవేత్తా
వాగీశ్వరో వందిత సత్కవీంద్రః
శ్రీభానుతంత్రం పరిచింత్య సమ్యక్
పంచాంగమేవం ప్రకటీకరోతి ॥
తస్య పుత్రో గుణో ధీమాన్ కృష్ణశాస్త్రీతి విశ్రుతః
సౌరసిద్ధాంతమాలోడ్య పంచాంగం కురుతే సదా ॥
తత్పుత్రః ప్రథితః ప్రశస్తగుణవాన్ ప్రాచుర్యపాండిత్యవాన్
శ్రీకృష్ణాఖ్య బుధస్సదా చ కథిత స్సద్వైర్జనై స్సూరిభిః-
సిద్ధాంతం సవితుర్విమృశ్యకురుతే పంచాంగమత్యద్భుతం
వర్షంవర్షమతీవబుద్ధికుశల శ్శ్రీరామభక్తస్సుధీః ॥

* * * *

**End :**

(ఫాల్గుణ బహుళము.)

౩౦ శ ౩౬-౫౩ పూ ౧౪-౫౮ ఉ ౫౧-౫౧ చ ౪-౧౧ రా ౧౧-౪౨ త్యా ౪-౨౬ దిన ౨౮-౫ శుక్ర ౧౫ మీ. తిలలవణకార్పాసాదీనాం పూర్వార్ఘః శక్తి మహోత్సవపుణ్య కాలము.

౧ ఆ ౪౧-౫౭ ... ........ . ...... . . .

* * * *

అనూరాధాయాః ——— జామిత్రదోషః తతోబ్దసంధిః.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిదే. శైథిల్యము గ్రంథపాతములు గలవు.

ఇది శాలివాహనశకాబ్దము ౧౭౪౬ లకు సరియగు తారణ సంవత్సర పంచాంగము. దీనిని కృష్ణసిద్ధాంతి పీఠికాపురాధీశ్వరుఁడైన రావు నీలాద్రిరాయల యాజ్ఞచే రచించెను. గ్రంథాంతమున రెండాకులమీఁద రామస్తుత్యాత్మకమయిన గేయములున్నవి.

## No. 2348. దుందుభి సంవత్సర పంచాంగము.

### DUNDUBHI SAMVATSARA PAÑCĀṄGAMU.

Substance, palm-leaf. Size, 13½ × 1⅛ inches. Pages, 91. Lines, 5 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, fair but not free from mistakes.

Complete.

A Calendar for the year Dundubhi.

**Beginning :**

వాగీశాద్యాస్సుమనస స్సర్వార్థానా ముపక్రమే
యం నత్వా కృతకృత్యాస్స్యు స్తం నమామి గజాననం.

**End :**

౧ ౫ ౮ ౨౮ ౭ ౩౨ ౹ ౨౬.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత తిన్ననిది కాదు. శైదిల్య గ్రంథపాతములు గలవు.

దుందుభి సంవత్సరమును బేర్కొన్నాడుగాని దీనికి సరియగు శాలివాహన శకాబ్దము నిందు వ్రాయలేదు. కర్త పేరిందు గానరాదు.

---

## No. 2349. నవగ్రహచింతామణి.

### NAVAGRAHACINTĀMAṆI

Substance, palm-leaf. Size, 6⅞ × 1¼ inches. Pages, 218. Lines, 6 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, fair but not free from mistakes.

Complete.

A work on fortune-telling.

**Beginning :**

శుభమస్తు. అవిఘ్నమస్తు. నవగ్రహచింతామణి. ఈ పుస్తకము శుచిగానుండి అర్చించి తొమ్మిది గవ్వల తొమ్మిది మాట్లువేసి చూడగా నెంత లేసి అవునో ఆ లెఖ తొమ్మిదింట భాగించి యెన్ని మిగులుచున్న ఉన్నవో అన్నో యాంకు అన్నో బంతి చూచేది.

**End :**

ఈ వస్తువు అమ్మదు నష్టి అవును. ఈతనికి బలం చాలదు. గ్రహపూజ చేసేది. ఈ కోటపెట్టితే లెస్స అగును. ఈ చెర్వుకట్టితే లెస్స అవును.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత మంచిదే. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతములు లేవు.

ఇది యొక ప్రశ్నశాస్త్రగ్రంథము. గవ్వలతోఁ బంతెమువేసి నిర్దిష్టప్రకారము ప్రశ్న చూచిన నాయా పత్రములందు సమాధానము వచ్చును.

---

## No. 2350. నవగ్రహచింతామణి.

### NAVAGRAHACINTĀMAṆI.

**Substance, palm-leaf. Size, 6¾ × 1¼ inches. Pages, 172. Lines, 4 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, not good and not free from mistakes.**

Complete.

Similar to the work described under No. 2349 ante.

**Beginning :**

ఈ చింతించినకార్యం తెన్నవునో కాదో—

౧ ఈ చింతించిన ప్రయోజనం ఒక బంధువువల్ల మహాజయమౌను.

౨ సర్వధాను ............ కూర్చుక మెల్లగా వత్తురు.

౩ ఈసారి .................. నిజము.

౪ ఈ స్త్రీ ..................

౫ ఈతనికి కన్యకనిస్తేను చాలా .........

౬ ఈ గర్భం నిజము. నల్లని మగవాని గని ......... వర్ధిల్లు.

౭ ఈ దేవరను కొలిస్తేను చాలా దారిద్ర్యంగాని మేలులేదు.

౮ ఈడనుండి పోయిన ......... సుఖాన ఉన్నా .......

౯ ఈ వస్తువ అమ్మక . ....... నష్టపడి దుఃఖం మేలులేదు.

**End :**

ఈ కన్యక వీరికి యిస్తే తెన్నవునో కాదో—

౧ ఈ కన్యను వీరికి యిస్తేను కాపురం వేళ సుఖం, విరోధంకాత ......

* * * *

౯ ఈ రాజు యీతనిమీద కృపజాల......... కాని మేలులేదు.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత మంచిదికాదు. శైథిల్య గ్రంథపాతములు చాల గలవు తప్పులున్నవి.

ఇది డి. నె 2349 ఉన వర్ణితమయిన గ్రంథమును బోలినదె.

---

## No. 2351. నవరత్నచింతామణి.

### NAVARATNACINTĀMAṆI.

**Substance, palm-leaf. Size, 8¼ × 1¼ inches. Pages, 2. Lines, 7 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, fair but not free from mistakes.**

Begins on fol. 46*a* The other works herein are :—1*a*. Kālanirnayamu, 25*a*. Gaurīpañcāṅgamu, 33*a*. Grahabhāṣyamu, 43. Akṣara Śakunamu.

Complete.

On predicting future events.

**Beginning :**

ఇది నవరత్నచింతామణి. ఇది శకునంచూచే మార్గం తొమ్మిది గవ్వలుతెచ్చి నాలుగుమార్లు పందెం వేసేది.

**End :**

| | | |
|---|---|---|
| రోజన ఆదా. | ○ | సపుత్ర ఫలాలు. |
| | ○ | = |
| | ○ | ○ |
| | ○ | — |

ఈ నవరత్న ఫలాలు చూచేది.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత బాగున్నది. శైథిల్యము లేదు. గ్రంథపాతము లేదు.

ఇది యొక ప్రశ్నచూచు పాళీ. ఇందు 9 గవ్వలతో పందెమువేసి ప్రశ్న చూడబడును.

---

## No. 2352. నిమిత్తచూడామణి

## NIMITTACŪDĀMAṆI.

Substance, palm-leaf. Size, 5⅛ × 1⅛ inches. Pages, 50. Lines, 3 on a page. Character, Telugu. Condition, slightly injured. Appearance, old. Mode of writing, not good and not free from mistakes.

Complete.

A work on fortune-telling.

**Beginning :**

నిమిత్తచూడామణి ధర్మరాజు జూచిన ప్రశ్న ...... తునకును పాచికచేసి ఒకవైపున ఒకటిన్నీ రెండోవైపున రెండు మూడో దిక్కున పది, నాల్గో దిక్కున నూఱున్ను ఈ చొప్పున లెక్కవ్రాసి ఈ పొస్తకం అర్చించి పార్వతీపరమేశ్వరులున్ను గణాధిపతిని ధర్మదేవతను ప్రార్థనచేసి మంచిదినం విచారించి శనివారంనాడు అర్చించిన తర్వాత పాచిక పుచ్చుకొని ముమ్మాటువేసి ఆ లెక్క గుఱుతువుంచి పొస్తుకములోను ఆ లెక్కలు వ్రాసిన పట్టి చూచితేను శుభాశుభములు తెలియవచ్చును.

* * * *

1
1 } ఈ శకునం మేలు. పరమేశ్వరుని కృపవల్లను రోగము మానును కొత్తగా వచ్చిన వారికి అన్నవస్త్రంగల్గి సుఖాన వుందురు.
1

**End :**

100 }
100 } ఈ శకునం మేలు. కృష్ణునివల్లను వెరవులేదు తలచిన తన కార్య
100 } సిద్ధియగును.
100 }
2 } ఈ శకునం మేలు పరమేశ్వరుని కృపవల్లన దీర్ఘాయువు చక్కనగును.
1 }

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత మంచిదిగాదు. తప్పు లున్నవి. శైథిల్యము గలదు. గ్రంథ పాతము లేదు.

ఇది యొక తీరు ప్రశ్న చూచు విధానము.

---

## No. 2353. నిమిత్తచూడామణి.

## NIMITTACŪḌĀMAṆI.

Substance, palm-leaf. Size, $8\frac{3}{4} \times 1\frac{1}{4}$ inches Pages, 66. Lines, 3 on a page. Character, Telugu Condition, injured. Appearance, old. Mode of writing, fair but not free from mistakes.

Complete.

A work on fortune-telling. The author is not known

**Beginning :**

౧ } ఈ శకునము మేలు. నీవు సమ్ము అడిగిన పని శ్రీ పార్వతీదేవి కృపను
౨ } ఆ పని ఫలించును. ఒకరితో చుట్టరికం చేసినా మేలు. ఆ చుట్టరికము
౨ } కీడు సేయవద్దు.

**End :**

౧౦ } ఈ శకునము మేలు. నీవు అడిగిన పని అల్లాదినాథుని కృపను దోష
౧౦౦ } ములు తొలంగిపోవును. నీవు తలంచిన పని సిద్ధించును. మేలు
౧౦౦ } గలుగును. తప్పదు.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత తిన్ననిదే. తప్పులున్నవి. శైథిల్యము గలదు. గ్రంథ పాతములంతగా లేవు.

ప్రశ్న చెప్పు విషయమిందు గలదు. ఈ వచన గ్రంథమును రచించినవారెవరో తెలియదు.

గ్రంథాది నిట్లు గలదు :—

"శ్రీగంధపుచక్క నాల్గు పల్కలుగా పాశికచేసి వొక పల్కమీద నూరు, రెండో పల్కను పది, మూడో పల్కను రెండు, నాలుగో పలకను వొకటి యీా చొప్పున వ్రాసిన పల్కపాశిక తన కరతలంబునం బట్టికొని హరిహర హిరణ్యగర్భులను లక్ష్మీదేవి, యుమాదేవి, సరస్వతీదేవిని వినాయకదేవునిం దలంచి ముమ్మారు వేసిచూడగా నంద్దు శుభా శుభములు కానంబడును. దీని పేరు నిమిత్యచూడామణి. ఈ నిమిత్యచూడామణి

మునుపు శ్రీ కృష్ణదేవ ధర్మజ భీమార్జున నకుల సహదేవులు చూచుకొన్నందుచేత మహైశ్వర్య పదవులు గలిగి వెలసినారు. అది గనక దీని శకునము వలసినప్పుడు చూచుకొనేది. ఇది మహాధారశుద్ధి. దీని శకునము దృష్టాంతమౌను. శ్రీ పరాభవ నామ సంవత్సర భాద్రపద బ ౬ బుధవారము రోజునను ముగుళ్ల నారాయణుని ప్రతి క్రమానను గోపరాజు రామజోగి బండా... కామయ్యగారి నిమిత్తము శ్రీరామార్పితంగాను వ్రాసితిని."

---

## No. 2354. నిమిత్తచూడామణి.

## NIMITTACŪḌĀMAṆI.

**Substance, palm-leaf. Size, $5\frac{3}{8} \times 1$ inch. Pages, 56. Lines, 4 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, fair but not free from mistakes.**

Complete.

On the forecasting of the results of undertaking journey at a particular time, in a particular direction.

**Beginning :**

ఆదివారము—తూర్పున.

| | | |
|---|---|---|
| ౧ జామున | ... | నిష్ఫలం. |
| ౨ జామున | ... | శుభం. |
| ౩ జామున | ... | లాభం. |
| ౪ జామున | ... | అర్థము గల్గును. |

**End :**

శనివారము— ఈశాన్యానను.

| | | |
|---|---|---|
| ౧ జామున | ... | మరణము. |
| ౨ జామున | ... | మేలువార్త. |
| ౩ జామున | ... | కలహము. |
| ౪ జామున | ... | మేలువార్త. |

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత మంచిదే. శైథిల్యము గలదు. గ్రంథపాతము లేదు.

ప్రతి దినమందలి ప్రతి యామమునకు దిక్ఫలములిందు వ్రాయఁబడియున్నవి. కర్త పేరిందు గానరాదు. కడపటి యాకుమీఁద నాల్గు యన్త్రములున్నవి.

---

## No. 2355. పంచపక్షీ శాస్త్రము.

## PAÑCAPAKṢI ŚĀSTRAMU.

**Substance, paper. Size, $8\frac{1}{2} \times 5\frac{3}{4}$ inches. Pages, 8. Lines, 33 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, fair but not free from mistakes.**

Complete.

This is a Telugu rendering of the Sanskrit work on the science of divination or horary astrology. The author is Taḍakamaḻḻa Kṛṣṇa Rao who wrote it for Munisvāmi Śrēsthi

**Beginning :**

శ్రీ వేంకటార్యసద్గురుబ్రహ్మణే నమః.

శ్రీ సంస్కృత పంచపక్ష్యధ్యాయాంధ్ర వివరణము.

సీ. శ్రీశైలవాసియౌ శివుని సర్వజ్ఞుని-మునిసంఘములు చేరి ముకుళితకరు
లగుచు భావ్యర్థంబు లరసెడు వేడుకఁ-బ్రశ్న ఫలంబులు పలుకుమనుచు
వేఁడిన శాస్త్రార్థవేదియౌ శంకరుఁ-డాగామివర్తమానాదికములఁ
బంచపక్ష్యమనంగఁ బరగు శాస్త్రముచేతఁ-దక్క నొంటను నెఱుంగఁదగదటంచు

గీ. దలఁచి వారికనిరు దయతోడ దైవజ్ఞ-కడకువచ్చి యడుగఁ గడఁగునరుని
యక్షరంబు స్వరము లంగచేష్టితములు-దెలిసి దాని నరయవలయు ననుచు.

క. చెప్పంగఁ దొడఁగె మునులకు, నప్పరమేశుండు పక్షి నరసెడు విధముల్
దెప్పునను బ్రశ్న నెఱిఁగెడు, చొప్పును సిద్ధిక్రమంబు సులభముగాఁగన్.

గీ. మంత్రసిద్ధిలేక మహినెట్టి విద్యయు-సిద్ధిదంబుగామి బుద్ధి నెఱిఁగి
దానిఁ దెలుపఁ దొడఁగె ధరణీసు రాళికి-జపవిధానమాది సర్వమపుడు.

**End :**

గీ. ఇట్లు పక్షిశకున మెల్ల సంగ్రహముగఁ-బల్కె నయ్యో శుభము బహుళలాభ
ములును శివునిచేత మునులకుఁ గాలత్ర-యములు దెలియునట్టి గమకముగను.

క. పలువితముల శకునంబులఁ, గలుఁగదు ప్రశ్నములసిద్ధికడ భ్రమములె యౌఁ
బులుఁగుల శకునములందును, గలయట్టుల నెందు విధులఁ గలుగు నె సిద్ధుల్.

క. మునిసామి శ్రేష్ఠికొఱకయి, తెనుఁగున రచియించె దీనిఁ గృష్ణకవీశుం
డనఘులు దీని క్రమంబునఁ, గనుఁగొని పొరఁబాటుగలుగఁ గరుణనణఁచుఁడీ !

క. వృషవత్సర వైశాఖపు, వృషమాసపుఁ బూర్ణిమయున వేంకటకృష్ణుం
డిషితాగ్రమతులకొఱకయి, వృషవాహను కరుణదీని వివరించెఁజూడీ !

(ఇటుతర్వాత, పయి శాస్త్రవిషయము చక్రరూపముగాఁ బ్రదర్శింపఁబడినది.)

తుమ్ము శకునముల దిఙ్నిర్ణయము తర్వాతఁ గలదు.

సీ. దిగ్విభాగములచేఁ దెలియుచోఁ దుమ్ముల-ఫలములు పూర్వాది వెలయుదిక్కు
లందు మేషాదిగా నందంద రెండేసి-మూలలనొండొండ క్రాలఁజేసి
యారాశిచోటుల నలవడు తుమ్ముల-ఫలములు వరుసగాఁ దెలియుఁడిట్లు
పెద్దయార్భాటముల్ పెనుగలహంబులు-నొప్పులు కటకంబు నొందమేలు
గలుగు దధికీరములు సింహరాశిని-గన్యనిందయుఁజాల గలుగుచుండు

సంధిగల్గుచుండు స్వర్ణలాభంబగు-విందుభోజనములు వెలయు ద్రవ్య
లాభమగును సౌఖ్యలాభ మోదంబులు-నధిక సంతసంబు నరులకగును.

ఈ పద్యార్థము క్రింద పధకరూపముగాఁ జూపఁబడినది.

(వి-వి)—

సమగ్రము. వ్రాఁత మంచిదిగాదు. గొలుసుగొట్టు వ్రాఁత. తప్పులు లేవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

ఇది పద్యరూపమగు ప్రశ్నశాస్త్రగ్రంథము. సంస్కృతగ్రంథమున కిది తెలిఁగింపు. గ్రంథకర్త తడకమళ్ల కృష్ణ రావు. మునిస్వామి శ్రేష్ఠికొఱకై యాతఁడు దీని రచించెను. గ్రంథము తుద తుమ్ముఫలముచెప్పు పద్యము పై కృష్ణరావుగారు రచించినది గలదు.

---

## No. 2356. పంచపక్షి శాస్త్ర టీక

## PAÑCAPAKSI ŚĀSTRA ṬĪKA

Substance, palm-leaf. Size, 17¼ × 1¾ inches. Pages, 22. Lines, 7 on a page. Character, Telugu. Condition, slightly injured. Appearance, old. Mode of writing, fair but not free from mistakes.

Begins on fol 1*a*. The other works herein are :—13*a*. Ṣadvargadīpika, 26*a*. Rājayōgādiviṣayamu, 29*a*. Aṣṭakavargacakra, 37*a* Gaṇḍadōṣādulu.

Complete.

A work on horary astrology, containing Sanskrit verses with their Telugu meaning.

**Beginning :**

నమస్తుభ్యం మహాదేవ గురుశాస్త్రవిదాం వరైః
భవిష్యద్వర్తమానాయా వక్ష్యేహం పంచపక్షిణమ్.
శ్రియఃపతే నమస్తుభ్యం వక్ష్యే జ్యోతిషలక్షణమ్

* * * *

పంచపక్షిశాస్త్రంచూచే క్రమం యెట్లన్నను, ప్రశ్న ఆరూఢంనుంచిన్ని తత్కాలిక సూర్యోదయం గతులనెరింగి ప్రశ్నచేసిన ప్రథమాక్షరంనుంచిన్ని ఆమాతచేష్టనుంచిన్ని శ్యేన, పింగళ, వాయస, కుక్కుట మయూరప్రియాగతుల నెఱింగి ప్రశ్నలు తెలియవలెను.

**End :**

ప్రథమం రవిసౌమ్యం చ ద్వితీయం చంద్రచంద్రజౌ
తృతీయం గురువారే చ చతుర్థం భృగువాసరే
పంచమం మందవారే చ శుక్లపక్షే యథాక్రమశః

మందచంద్రమయూరే చ భానుభౌమే చ కుక్కుటౌ
వాయసే బుధవారే చ వాగీశో పింగళి స్తథా
భేరుండ భార్గవారే చ కృష్ణపక్షే యథాక్రమమ్.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత మంచిది. తప్పులున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

పంచపక్షిశాస్త్రమని సంస్కృతమునఁ గల ప్రశ్నశాస్త్రగ్రంథము తెలుఁగు టీకతో నున్నది.

---

## No. 2357. పంచపక్షి శాస్త్ర టీక.

## PAÑCAPAKṢI ŚĀSTRA ṬĪKA

Substance, paper. Size, 12¼ × 7¾ inches. Pages, 20 Lines, 24 on a page. Character, Telugu. Condition, good. Appearance, old Mode of writing, very good but not free from mistakes.

Begins on fol 54*b* of the Ms described under D No. 1462 Complete.

Same work as the above.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత తిన్ననిదే. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతములు లేవు.

పూర్వమువలె.

ఇందలి గ్రంథాంతరములను డి. నెం 1462 రున జూచునది.

---

## No. 2358. పమ్మివారింటి శుభప్రయోజన కాలములు

## PAMMIVĀRINṬI ŚUBHAPRAYŌJANA KĀLAMULU.

Substance, palm-leaf Size, 11 × 1½ inches Pages, 6. Lines, 5 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, old. Mode of writing, fair but not free from mistakes

Incomplete.

Contains the horoscopes of the sons of Pammi Kumāraswāmi.

**Beginning :**

పమ్మి కౌమారస్వామి కొమాళ్లు.

విశ్వావసునామ సంవత్సరం ఆలిపిశ నెల ౨౦ తేది కౌమారస్వామి శెట్టికి మొదటి కొమారుడు చిత్తయ జననం బుధవారం.

* * * *

**End :**

ప్రమోదూతనామ సంవత్సర... ఆని నెల ౨౬ తేది మునలయ్య... కొమారుడు చింతాయ పెండ్లి స్వభాను సంవత్సరం చిత్రి నెల ౧౯ తేది వెంకటస్వామికి శ్రీమత్కొమార జననం ......

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత తిన్నది. తప్పులున్నవి. శైథిల్య గ్రంధపాతములు కలవు.

షష్ఠి కుమారస్వామి కొడుకులు పుట్టిన రోజులు, వారిచటి శుభప్రయోజనములు మున్నగు విషయములిందు వ్రాయఁబడియున్నవి. కర్త పేరిందు గానరాదు.

---

## No. 2259. పరాభవ సంవత్సర పంచాంగము.

## PARĀBHAVA SAMVATSARA PAÑCĀṄGAMU.

**Substance,** palm-leaf. **Size,** 8 × 1½ inches. **Pages,** 62. **Lines,** 7 on a page. **Character,** Telugu. **Condition,** injured. **Appearance,** old. **Mode of writing,** fair but not free from mistakes.

Complete.

A calendar for the year Parābhava corresponding to Śaka 1648 (1726 A D ).

**Beginning :**

వాగీశాద్యాస్సుమనసస్సర్వార్థానా ముపక్రమే
యం నత్వా కృతకత్యాస్స్యుస్తం నమామి గజాననమ్.

* * * *

శ్రీమత్తంజాపురస్థశ్శివచరణరతో రావివంశప్రసూతిః
త్రిస్కంధీపారవేత్తా మహితహరితసద్గోత్రజస్తైత్తిరీయః.
శ్రీలక్ష్మీపద్మనాభప్రథితతనుభవ స్సూర్యసిద్ధాంతరీత్యా
శ్రీవేంకట్రామ విద్వాన్ కలయతి సుకృతాధాయి పంచాంగమేతత్.

* * * *

అస్య సంవత్సరస్య శాలివాహనశకాబ్దాః ౧౬౪౮ కల్యబ్దాః ౪౮౨౭ శ్రీమద్వ్యావహారిక చాంద్రసౌరమానాభ్యాం పరాభవ సంవత్సరస్య రాజా బుధః.

**End :**

30 శు ౪౫-౯ పూ ౨౮ శు ౨౫-౯ చ ౧౩.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతములున్నవి.

ఇది శాలివాహనశకాబ్దము ౧౬౪౮ లకు సరియగు పరాభవ సంవత్సర పంచాగము. తంజాపుర వాస్తవ్యుఁడైన రావి వెంకటరామసిద్ధాంతి దీనిని రచించెను.

## No. 2360. బల్లిపలుకు ఫలము.

## BALLIPALUKU PHALAMU.

Substance, palm-leaf. Size, 14½ × 1½ inches Pages, 8. Lines, 6 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, not good and not free from mistakes.

Begins on fol 176*a* of the Ms described under D. No 1491.

Complete.

This describes good and bad omens as indicated by the noise made by a lizard. The name of the author is not known

**Beginning :**

శ్రీకరమొప్ప రాజీవమిత్రునిమీద-పలికిన గౌళికి ఫలము వినుము
వసుధ భైరుఖు జేడ వానలు గురియును-దినముల వెంబడి దీరు దెవులు
చావులేదరిదండు సాగివచ్చుటలేదు-వచ్చిన నృపుఁడీల్గు వలదు వింద
ధరణిజు పొడగన్న తప్పదు సంకెల-నిలిచియున్న భయంబు నివ్వటిల్లు
నరయ బేరము నష్టమౌ నప్పురాదు-శుభము దలచిన నశుభంబు జూపు
కీడు దలచెనేని మేలగు తరుణుఁడసిత-వసనుఁ డరుదెంచు నల్లనివాఁడు కృష్ణా.

**End :**

శనిరాత్రి ముప్పది చండాంశుదివమున-దక్షిణంబున నుండు తథ్యముగను
ఇనురాత్రితోగూడి యిందువారంబెల్ల-నైరృత్యమున నుండు నయముగాను
పదియు తక్కువగాను భౌమవారంబెల్ల-పశ్చిమంబున నుండు పంథమరయ
భూపుత్రశేషంబు బుధవారదివమును-వరుసతో గ్రహముండు వాయుదెసను
సోమసుతుని రాత్రి సురగురుయేబది-యుత్తరంబున నుండు నున్నతముగ
సురగురుదశకంబు శుక్రవారంబెల్ల-శంకరు దెసనుండు జక్కతోడ (?)
శనియు వారంబు దివమందు చెలగియుంశు-రాహుకును గౌళికీరీతి జెలగియుండు.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిదికాదు. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతములు లేవు.

బల్లిపలుకు ఫలమిందు వర్ణితము. కర్త పేరెఱుఁగరాదు.

ఇందలి గ్రంథాంతరములను డి. నెం 1491 రున జూచునది.

---

## No. 2361. బల్లిపలుకు, తుమ్ము ఫలములు.

## BALLIPALUKU, TUMMU PHALAMULU.

Substance, palm-leaf. Size, 6½ × 1 inch. Pages, 54. Lines, 4 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, fair but not free from mistakes.

Incomplete.

Explains good or bad omens as indicated by the touch of and the noise made by a lizard and the sneezing of people.

**Beginning :**

బల్లిపల్కు॥ తూర్పున పల్కిన పల్కు త్వరత్వరగా ఫలమిచ్చును.

* * * *

తుమ్మున ముష్టి॥ ఆదివారం, తూర్పున—

౧ జామున ... బలం.

౨ జామున . శుభం.

౩ జామున . లాభం.

౪ జామున .. అర్థం కల్గును

**End :**

ఈశాన్యానను —

౧ జామున ... మరణము.

౨ జామున .. మేలువార్త.

౩ జామున ... కలహము.

౪ జామున ... మేలువార్త.

గ్రంథాది నిట్లు గలదు :—

"౧ ఇది తుమ్ములు ముష్టి రెండు విధాలు, జాములకు వక విధం, దినములకు ౧.

౨ బల్లిపల్కు . .. బల్లిపాటున్ను, స్థానాస్థానాలు అదరడానకున్ను.

౩ కాకి రెట్టవేసినందుకున్ను, గార్దభం కూసినందుకున్ను, పోచిళ్లున్ను ఇవి యీ పుస్తకంలో ఉన్నవి."

(వి-వి.)—

అసమగ్రము. వ్రాంత మంచిదే తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతములు లేవు బల్లిపాటు, బల్లిపలుకు, తుమ్ములు వీనికి ఫలములిందు తెల్పఁబడినవి.

---

## No. 2362. బృహజ్జాతకము.

## BRHAJJĀTAKAMU.

Substance, palm-leaf Size, 11¼ × 1¼ inches Pages, 38. Lines, 6 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing not bad but not free from mistakes.

Begins on fol 17*a*. The other work herein is :—1*a*. Uḍudaśāpradīpika (Sanskrit)

Incomplete.

Contains a portion of the Telugu meaning for Brhajjātaka, dealing with the preparation of fresh horoscopes when the originals are lost.

**Beginning :**

ద్రేక్కాణముగాని హేమంతఋతువందు జన్మించినని చెప్పేది. లగ్నమందు పెక్కు గ్రహాలుండిరా అంశులో బలాధికునిచె పెనఋతువందు జనించెనని చెప్పేది? (?) లగ్నమందు యెవ్వరూ లేకుండిరా యే గ్రహసంబంధమయిన ద్రేక్కాణమాయెనా ఆ గ్రహానకు ఆ గ్రహానకు చెప్పిన ఋతువందు జన్మించినవాడని చెప్పేది.

**End :**

ఇతి నష్టజాతకమిదం బహుప్రకారయావినిర్దిష్టం అతః సచ్ఛిష్యైః పరీక్ష్య యత్నాత్ యథాభవతీతి ఈ ప్రకారాన మయానాచేతను ఇదం సర్వజాతకం ఈ నష్టజాతకము బహుప్రకారం పెక్కుప్రకారములగాను వినిర్దిష్టం చెప్పఁబడెను. అతః ఇది కారణానంబట్టునిన్ని సచ్ఛిష్యైః మంచి గురుభక్తులయిన శిష్యులచాతను పరీక్ష్య విచారించి యత్నాత్ ప్రయత్నంవల్లను యథాభవతి యెటువలెనైనాను తథాతేషు వాలెను గ్రాహ్యం గ్రహించతగ్గది. ఆదితో గ్రంథసంఖ్య 17. ఇతి శ్రీవరాహమిహిరాచార్యకృతౌ.

(వి-వి.)—

అసమగ్రము. అనాద్యంతముగా నష్టజాతకభాగము మాత్రము గలదు వ్రాఁత ప్రాఁతది తప్పులు గలవు. శైథిల్యము గలదు. గ్రంథపాతములు గలవు.

బృహజ్జాతకమున నష్టజాతక గణన భాగమున కిది తెలుఁగు టీక. రచయిత పేరు లేదు.

— —

## No 2363. భార్గవ పంచాంగము.

### BHĀRGAVA PAÑCĀṄGAMU

Substance, palm-leaf. Size, $8\frac{5}{8} \times 1\frac{1}{4}$ inches Pages, 40 Lines, 7 on a page. Character, Telugu Condition, injured. Appearance, old. Mode of writing, not good and not free from mistakes.

Incomplete.

This is also known as Nakṣatrabhāṣya It deals with predicting fortune, determining the position of planets and their influence, etc.

**Beginning :**

అశ్వని, రోహిణి, పునర్వసు, మఖ, హస్త, మూల, శ్రవణం, పూర్వాభాద్ర ఈ తొమ్మిది నక్షత్రాలు మొదలిపాదం మేషాంశ, 2 పాదం వృషభాంశ, 3 పాదం మిథునాంశ, 4 పాదం కర్కాటకాంశ, భరణి, మృగశిర పుష్యమి, పుబ్బ చిత్త అనూరాధ

పూర్వాషాఢ ధనిష్ఠ, ఉత్తరాభాద్ర ఈ తొమ్మిది నక్షత్రాలు మొదటిపాదం మేషాంశ, 2 పాదం వృషభాంశ, 3 పాదం మిథునాంశ, 4 పాదం కర్కాటకాంశ.

**End :**

శతభిషం 1 చరణం ధనురంశ, శతభిషం 2 చరణం మకరాంశ, శతభిషం 3 చరణం కుంభాంశ, శతభిషం 4 చరణం మీనాంశ, పూర్వాభాద్ర 1 చరణం మేషాంశ, పూర్వాభాద్ర 2 చరణం వృషభాంశ, పూర్వాభాద్ర 3 చరణం మిథునాంశ, పూర్వాభాద్ర 4 చరణం కర్కాటకాంశ, ఉత్తరాభాద్ర 1 చరణం సింహాంశ, ఉత్తరాభాద్ర 2 చరణం కన్యాంశ, ఉత్తరాభాద్ర 3 చరణం తులాంశ, ఉత్తరాభాద్ర 4 చరణం వృశ్చికాంశ, రేవతి 1 చరణం ధనురంశ, రేవతి 2 చరణం మకరాంశ, రేవతి 3 చరణం కుంభాంశ, రేవతి 4 చరణం మీనాంశ.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాంత మంచిదిగాదు. తప్పులున్నవి. శైథిల్యముగలదు. గ్రంథపాతములు లేవు.

నక్షత్రభాష్యమని నామాంతరము దీనికిఁ గలదు. "ప్రశ్నలకున్నూ గ్రహనిర్ణయానకున్నూ ధాతువులకున్నూ జీవనిర్జీవలక్షణాలకున్నూ అబద్ధంలేదు బుద్ధిగలవానికి ఈ శాస్త్రం ప్రకాశం" అని యీ గ్రంథముననే గ్రంథవిషయము తెలుపఁబడినది.

---

## No. 2364. రట్టమతము.

## RAṬṬAMATAMU.

Substance, palm-leaf. Size, 14½ × 1¼ inches. Pages, 124. Lines, 4 and 5 on a page. Character, Telugu. Condition, very much injured. Appearance, very old. Mode of writing, very good but not free from mistakes.

Complete.

This is a Telugu version of the Kannaḍa work by Raṭṭa. It explains how the future, especially seasonal conditions favourable to agriculturists can be foretold by observing the flowers of trees, etc. It is stated that Ratta wrote his work in the light of the systems of Gārgya, Dhanakīrti, Haribhaṭṭu, Śrīpati, and Varāhamihira and the work Mēghamālika. Ayyalu and Bhāskara, descendants of Ayyalarāju Tripurāntaka (author of Oṇtimiṭṭa Raghuvīra Śatakamu) are the authors of the present work. The work has been dedicated to Veṅkaṭarāju, son of Peda Timmarāju. For details see extracts below.

**Beginning :**

శా. శ్రీరత్నాకరసంభవోక్తికలనన్ జెన్నొంది గార్గ్యాది మ
త్ర్యారూఢింగని మేఘమాలికసముద్యత్కాంతి(రాశిం) వాటించి ని
త్యోర్వశ్రీమహిమాశ్రయస్థితిదగన్ జ్యోతిర్మయుండైన సీ
తారామావిభుఁడేలు వేంకటనరేం। ద। శేషు నెలవుంచున్.

శా. లీలాద్యూతజితామృతాంశుకళఖేలింగేలు దోరాయత్తియు
ద్వేలప్రీతి హరించుగౌరి కుచముల్ వీక్షించునాసక్తిఁ ద
త్కేలక్షేపముగోరు పామిడి పురాధ్యక్షుండు భోగీశ్వరుం
డేలుం దిమ్మనృపాలు వేంకటధరిత్రీ శాక్రణిన్ నిత్యమున్.

* * * *

శా. శ్రీరంగేశ్వరుఁడే యితండని బుధుల్ సేవింపఁగా బోధ వి
ద్యారూఢోన్నతిధన్యుఁడై గురుమతాహంకారవిధ్వంసు(నిన్
గూరేశాన్వయ ?) వార్ధిచంద్రుగురుముఖ్యున్ మేరుధీరున్ మహో
దారున్ వేంకటభట్టురార్యుఁ దలఁతున్ దాత్పర్య మింపొందఁగన్.

గీ. ఘనులఁ బ్రాచేత సవ్యాస కాళిదాస-భారవిమయూర నన్నయభట్టతిక్క-
నాబ్జభవశంభుదాసుల నభినుతించి-సంస్కృతాంధ్రకవిత్వ విశారదులను.

వ. అని ........ యొక్క కృతి సకల శ్రుతిహితంబుగా నొనర్పంబూనియున్న
సమయంబున.

సీ. శ్రీమదహోబలస్వామి మహారాజ్య
రక్షకుండగుచునే రాజు వెలయు
నభిరామ (నవ?) కామదకాఖ్యసత్కావ్యర
త్నమునకు నేరాజు నాథుఁడయ్యె
జానకీనాయక చరణాబ్జసేవన
ప్రౌఢిచే నేరాజు ప్రబలు సిరుల
యువయూరిపురవరాధివాసిఁ ద్యక్షాది ? బహుభిరు
దాంకుఁడై యే రాజు యశముఁ గాంచె
నతఁడు కొండ్రాజు తిమ్మభూపతివరేణ్య
తనయ పెద తిమ్మరాజ ప్రధానగర్భ
వార్ధిచంద్రుండు సత్కులవర్ధనుండు
సతత విభవుండు వేంకట త్మావిభుండు.

క. ఒకనాఁడు నిఖిలకోవిద, సుకవిహితామాత్యబంధు సుతవీరభట
ప్రకరములు గొలువఁ గొలువుం, డికడుం బ్రమదంబు మదికి నివ్వటిలంగన్.

గీ. గాఢసుజ్ఞానమున రట్ట ఘనుఁడు మున్ను
చెలఁగి కన్నడభాషను జెప్పినట్టి
శాస్త్రమంతయు నేను సజ్జనులఁ బొగడఁ
దెలుఁగు సేయింతుననుచును దలఁచునపుడు.

సీ. పరిపూర్ణధవళాంగభవ్యుఁడై దివ్యతే-జమున మించిన శంఖచక్రములును
కరయుగ్మములఁ దాలి, కనకపీతముపాణి-యుగమున నూఁది యత్యుజ్జ్వల వ

నిజవాసమున రెండు భుజములపై శోణ-కాంతులెంతయును బ్రకాశముగను
కొంచెంబులో చెవి కొణకల నెఱ్ఱని-చాయలు మెఱయు కేసరచయంబు
ఉంగరపు వెండ్రుకలరీతి నుల్లసిల్ల-రామచంద్రుండహోబలస్వామియగుచు
కరుణ నాముందటను బొడగట్టినవ్య-హృద్యసూక్తుల నానతి యిచ్చె నిట్లు.

క. నీవు దలంచిన తలఁపు శు భావహము యశోనిధాన మటుగావునఁ దద్
భూవినుత మతముఁ గావ్యము, గా వేడ్కఁ బరిగ్రహింపు గ్రక్కున వత్సా!

గీ. అని ప్రసాదించినాఁడు మీ రవ్విశేష మతము ప్రతిపద్యమును మదంకితముగాఁగ
నంధ్రభా షనిరూఢిఁ గావ్యంబు సేయఁ-డఖిల జనులకు నుపకారమై చెలంగు.

వ. విశేషించి మీరు శ్రీరఘునాయకదయాలబ్ధ సారసారస్వతులును రఘువీరశతక నిర్మాణ కర్తృకరాయకవి తిప్పనార్య పౌత్రులును మదీయాశ్రితులునగుటం జేసి భవత్కవిత్వంబు మాకు నభిమతంబై యుండునని సబహుమానంబుగాఁ గర్పూరతాంబూలాంబరాభరణాది వస్తువు లొసంగిన నంగీకరించి యోగవిరభీమమూరురాయర బసువశంకర గుత్తిహన్నిబ్బరగండ కొంకణకోలాహలకాదేవు మీదేవుత లగుండుగండ మేదినియంకార ? మహాభిరుదాంకుండును విక్రమసాహసాంకుండును కాశ్యపగోత్రపవిత్రుండును కొండ్రాజు తిమ్మరాజన్య పుత్త్రుండునునైన వేంకటధరణీకళత్రునకు నంకితంబుగా మేము రచియింపం బూనిన యా కావ్యంబునకు ముఖాలంకారంబుగాఁ దదీయ వంశావతారంబు నభివర్ణించెద నది యెట్లనిన.

క. భానుఁడు శాశ్వతబహు సంతానుఁడు దిక్ప్రకరతిమిరదళనపటూద్యద్
భానుఁడు సంతతకరుణా, సూనుఁడు విలసిల్లునిర్జరోత్తముఁ డగుచున్.

* * * *

క. ఆ రామభద్రునకుఁ గుశ, వీరుఁడు జనియించె నిఖిల విబుధప్రకరా
ధారుఁడయి యితని కులమున, భూరిబలోజ్జ్వలుఁడు కొండ భూపతిపుట్టెన్.

శా. ఆకొండక్షితిపాలచంద్రుఁడు మహీయశికీర్తి సంపన్నుఁడై
లోకాలోకపరీతభూతలసుధీ లోకస్తుతప్రాభవుం
డై కంజాక్షిపదాబ్జభక్తిచతురుండై సత్యసంధామనీ
షాకారుణ్యభయాది సద్గుణసమాజస్ఫూర్తి మించెన్ మహిన్.

శా. ఆనరనాథపుంగవున కాశ్రితరక్షణతత్పరుండు స
న్మానసుయోధనుండు నృపమాన్యుఁడు జన్యకిరీటి విస్ఫుర
ద్దానకళావిరాజిత సుధాకరమేఘదధీచిఖేచరాం
భోనిధితిమ్మభూతలవిభుం డుదయించె జగత్ప్రసిద్ధుఁడై.

గీ. విమలగుణనిధిబొమ్మభూవిభునిమంగ-రాజవర్యుని పుత్త్రికారత్నమయిన
యక్కమాదేవి నుద్వాహమై చెలంగె-జలధిసుతఁ బెండ్లియాడిన శౌరిరీతి.

క. ఆదంపతులకుఁ బొడమె ద, యాదాక్షిణ్యాంబురాశి హరిభక్తి ప్ర
హ్లాదుఁడు సతతత్యాగ, శ్రీదుఁడు పెద తిమ్మరా....

మ. విదళించెన్ కవిరాడ్దరిద్రతను భూవిఖ్యాతమై మించు న
భ్యుదయంబొంది యశంబుగాంచె మదలీలోద్దండవిద్వేషులన్
గదనక్షోణులఁ దోలి గెల్చు సిరులన్ గన్పట్టెఁ గొండ్రాజు శ్రీ
పెదతిమ్మక్షితిపాలమౌళికెనయే పృథ్వీపతుల్ తక్కొరుల్.

గీ. అట్టి పెద తిమ్మరాజు ధైర్యాద్రి రాజు-సంగవిభుగుర్వశౌరి యనుంగుఁ గూఁతు
నంగనాశిరోమణిపాపసంగమాఖ్యఁ, బ్రేమ వరియించె విభవాభి రాముఁడగుచు.

క. గుణఖనియగు తత్కన్యా, మణిజనకున్ బు(బో?)ధజనకు మంజులభాషా
ఫణివరు రణవిజయార్జునుఁ, బ్రణుతింప వశంబె గురువ పార్థివవర్యున్.

సీ. పృథులవిక్రమశాలి పెద సంగనృపతియు-సత్యసంధుఁడు చిన సంగరాజు
ధర్మగుణాఢ్యుండు తమ్మభూపాలుండు-రుచిరకీర్తిధనుండు రుద్రఘనుఁడు
ప్రధనాంగణకిరీటి బసువనరేంద్రుండు-స్థిరభాగ్యనిధి పెద చిట్టివిభుఁడు
సింధుగభీరుండు చిన చిట్టిధన్యుండు-సతతపుణ్యుఁడు పోలి సంగశౌరి
కలితతేజుండు పాపసంగప్రభుండు-ననఁగఁ బరగి దొమ్మండ్రురఁ దనయవరులఁ
గాంచి దిగ్జయశీలుఁడై మించెనౌర-సంగరాజన్య గురువసుమాద్వరుండు.

క. ఆగురువరాజవరునకు, త్యాగసముద్రునకు నల్లుఁడై చెలఁగె ధరా
భాగభరణక్రియానా, భాగుండు పెద తిమ్మరాజు ప్రజలు నుతింపన్.

గీ. ధీరశేఖరుఁడా పెద తిమ్మరాజు-లలితగుణముల నుభయకులప్రసిద్ధ
యైన యలపాపసంగమాహ్వయపతివ్ర-తాశిరోమణియందు ముదంబుతోడ !

చ. పరనృపభంజనోగ్రుఁడయి భాసిలు దాసరి రాజశేఖరున్
దిరుపతి ధారుణీశుఁ గులదీపకు వేంకటపార్థివోత్తమున్
గురుయశుఁ గృష్ణయప్రభునిఁ గొండల ధీరుని బాహుశౌర్య సు
స్థిరురఘునాథశౌరిఁ జిన తిమ్మనృపాలునిఁ గాంచె ధన్యుఁడై.

వ. అందు.

ఉ. ఏపైన శౌర్యమునఁ గేరును మీరును కీర్తిలీల గం
గాసరిదబ్జశేఖరుల కాంతుల కల్వలరాచవారి కెం
తేసరివచ్చు తిమ్మధరణీధవనందన రత్నమైన మా
దాసరి రాజవర్యుని బుధస్తుతచర్యుని నెన్న శక్యమే.

చ. గురుమతిచాతురిన్ భుజగకుంజరు గెల్చును వార్ధికన్యకా
వరునతిభక్తిఁ గొల్చు ననివారితమానవిశేష సంపదన్
గురుపతిరీతిఁ బోల్చు నలఘుప్రభుఁడా పెద తిమ్మశౌరి మా
తిరుపతి పార్థివోత్తముఁడు ధీరవరేణ్యుఁడు రాజమాత్రుఁడే !

ఉ. రాజధరున్ భజించు ఖగరాజతురంగుని సంస్మరించు సం
భాజమదగ్నిరాముఁడన ఖ్యాతి రహించు హలాయుధామర
క్ష్మాజసుధాంశుజిత్వరల సత్తరకీర్తి సముద్ధరించు కొం
డ్రాజవతంసు తిమ్మనృపరత్నము వెంకటరాజు వేడుకన్.

ఉ. జిష్ణునధఃకరించును బ్రసిద్ధికి నెక్కిన వైభవంబునన్
జిష్ణుని ధిక్కరించు రిపుజిత్వరు బాహుపరాక్రమంబునన్
గృష్ణుని సంతతంబు భజియించును దిమ్మనరేంద్రచంద్రుమా
కృష్ణనృపాలశేఖరుఁడు కీర్తిధురంధరుఁ డెంత పుణ్యుఁడో !

ఉ. చండలసత్ప్రతాపమునఁ జారువికాస విలాసరేఖమా
ర్తాండలశాంతసాయకులఁ దార్కొనుమార్కొను తాల్మికల్మి
కొండలరేని తిమ్మకుంజరసూనుఁడు కొండలయ్య యా
తండలశ్రీధవాంశజుఁడె తప్పదు పోషణ బుద్ధిసంపదన్.

ఉ. ధీరశిఖావతంసము సుధీరమణీయుఁడ సూనదాన వి
ద్యారసికత్వభూషణుఁడు ధన్యగుణాఢ్యుఁడు తిమ్మశౌరి మా
శ్రీరఘునాథరాజు భళిరే శరణాగతరక్షణంబునన్
దారఘునాథు నంతటి కృతార్థుఁడతం డొక రాజమాత్రుఁడే !

చ. స్థిరమతిఁ బెద్దతిమ్మ జగతీపరమౌళితపఃఫలంబు స
ద్గురుజనదీనబంధుకల్పకము కోమలకీర్తి వధూప్రియుండు భా
స్వరవిజయాంగనాయుతుఁడు శాశ్వత రాఘవ భక్తిశాలి శ్రీ
తిరుమలరాజురాజులు వితీర్ణిగుణక్రమవిక్రమ . .........

క. కృతిద్యై రమణీయశుభా, కృతిద్యై యభయప్రదాన కృతికర్తయునై
నుతికెక్కను బెదతిమ్మ, క్షితిపతి తిరుమలనృపాలసింహుఁడు జగతిన్.

చ. .........పరాక్రమక్రమవివేకవిశిష్టజనావనక్షమా
ధృతినిధి పెద్దతిమ్మమనుజేంద్రుని శ్రీ చినతిమ్మమేదినీ
పతితిలకంబు బొమ్మనరపాలుని పర్వతరాజ ........
........ కులశీలమానవతి నాబళదేవి వరించె వేడుకన్.

గీ. ఆ వధూమణియందునో బన్నఘనుఁడు
ప్రతిభ చెన్నొందు వేంకటపతి ............
........ ...నాథ నరవరుండు
నాదియగు పుత్త్రిలను గాంచి ఖ్యాతి మించె.

ఉ. ఆ చినతిమ్మభూవిభున కగ్రజుఁ డాశ్రితకల్పశాఖి
......ననుండు జగతీపమహోశిరుదాంకుఁడాదితే

యాచలధీరుఁడూర్జిత దయానిధి వేంకటరాజు నిత్యధ
ర్మాచరణప్రవీణుఁడు నయా ..... .. విలసిల్లు నెంతయున్.

గీ. సరసుఁడా వేంకటేంద్రుండు సాళ్వవంశ
తిలకునకుఁ గోనరాజపుత్త్రికల .........
... .....రణుఁ బెద్ద కృష్ణమదేవి ... ..
. .. . .. దేవిఁ బ్రేమఁ బరిగ్రహించె.

వ. ఆ సాధ్వీరత్నంబులలోఁ బెద్ద కృష్ణమదేవియందు.

గీ. అనఘ గుణుఁడైన పెద్ద తిమ్మన్న కృష్ణ-పార్థివుఁడు నోబధీరుఁడు బసవరాజు
నిత్యవిభవుండు వీరన్న నీలకంఠ-ధన్యుఁడనమించు నందనోత్తములఁ గాంచె.

క శ్రీ వెలయఁగఁ జినకృష్ణమ, దేవీరత్నంబునందు స్థిరకీర్తి నిధిన్
భావజ్ఞు విరూపాక్షు, త్త్మావరునిన్ గాంచెఁ జగతిఁ బ్రస్తుతికెక్కన్.

వ. మఱియు నక్కుమారులం గ్రమంబున నభివర్ణించెద.

మ. పటుసుజ్ఞానకళానిరూఢి... ..... బోధుతోనైనమా
రటుగాండీవి యనందగున్ విమత గర్వధ్వంసనప్రౌఢి వి
స్ఫుటసత్యోక్తినజాతశత్రుకరణిన్ బోల్పొందు కొండ్రాజు వెం
కటు ..... ..————————తిమ్మధరణీకాంతావతంసంబిలన్.

మ. కుటిలత్వంబు పయిళిక్కి కల్లన హి టక్కుల్ లేవు మాత్సర్యమె
ప్పటికిన్ నాస్తి యనూనదాన... .. ..
క్కటి గాంభీర్య కళావిశేషమహిమన్ గన్పట్టు కొండ్రాజు వెం
కటుభూపాలవరేణ్యకృష్ణ నృపలేఖస్వామి కూహింపఁగన్.

క. రాజుకళావైఖరిసుర, రాజు .... . ..కుధరరాజు ధృతిన్ రా
రాజువదాన్యత వేంకటు, రాజన్యుని సుతుఁడు మల్లరాజేంద్రుఁ డిలన్.

క. అసదృశవితరణవిద్యా, రసికునకును ధైర్యశౌర్యరాజేం
ద్ర....... .. వేంకటుభూవరు, బసవ నృపాలునకు నన్యపార్థివు లెనరే.

క. ధీరుఁడు బాంధవసుజనా, ధారుఁడు శూరుఁడు నితాంత దానవినతమం
దారుఁడు వేంకటుశౌరి కు, మారుఁడు వీరణ్ణరాజమాత్రుఁడౌ ధరణిన్.

ఉత్సాహ.

నీలకంఠునిన్ జయించి నీరజారిగేరి యా
పాలకడలిమించి హంస పంక్తి.....పూర్వ ది
క్పాలకరిని ధిక్కరించి ప్రబలు వెంకటేంద్రుమా
నీలకంఠరాజుకీర్తి నిఖిల దిక్తటంబులన్.

క. శిక్షించు ఖలులఁ గరుణన్, వీక్షించున్ . . . . . . . వేంకటవసుధా
ధ్యక్షుని విరూపాక్షాధిపు, నక్షుద్రయశోభిరాము నలవియె పొగడన్.

క. ఈరీతిఁ బుత్త్రసంప, ద్భూరియశోరాజ్యవిజయ భోగాధికుఁడై
పౌరుషనిధి పెదతిమ్మ, క్ష్మారమణుని వేంకటాద్రి జనపతి యలరున్.

సీ. వసుమతీభార నిర్వహణక్రియాభుజం
గవిభూషణుండు వేంకటవిభుండు
నిఖిలదిశాభాగ నిబిడయశస్సూన
ఘనసౌరభుండు వేంకటవిభుండు
సంతతాసూన విశ్రాణనవైఖరీ
కర్ణనిభుండు వేంకటవిభుండు
దీపితబాహుప్రతాపాధరీకృత
గ్రహరాట్ప్రభుఁడు వేంకటవిభుండు
రాజమాత్రుండె తలఁపఁ గొండ్రాజుతిమ్మ
ధరణినాయక తనయుండు దాత్తనయుఁడు
ప్రౌఢవిద్వత్కవీశ్వర ప్రకరవినుత
గాఢసత్ప్రతిభుండు వేంకటవిభుండు.

షష్ఠ్యంతములు.

క. ఏతాదృశగుణనికర స, మేతునకు మహాప్రతాపమిహిరక్ష్మాంతా
రాతిచమూత్వరినీసం, ఘాతునకు దయాళుహృదయ కంజాతునకున్.

* * * *

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నా యొనర్పంబూనిన రట్టశాస్త్రంబునకు ననుక్రమం బెట్టిదనిన, వర్షాదిహేతువులయిన భూజాత పుష్పఫలపరీక్షయు గోప్రజార్చన శకునంబును, పక్షిశకునంబును, దూతలక్షణంబును, మేఘలక్షణంబును, విద్యుల్లక్షణంబును, గర్జితలక్షణంబును, ఇంద్రచాపలక్షణంబును, పరివేషలక్షణంబును, ప్రతిసూర్యాతపవాయులక్షణంబును, బీజావాపనంబును, వర్షఖండంబును, గ్రహణఫలంబును, నాకస్త్రీకలక్షణంబును, గ్రహచారాస్తమయోదయలక్షణంబులును, గ్రహయుద్ధలక్షణంబులును, గురూదయాబ్దఫలంబులును, సంవత్సరాధిపతిఫలంబును వివరించియుండు నందు.

సీ. వరుసగార్గ్యాచార్యవర్యుని మతమును-మతిశాలి హరిభట్టు మతమునందు
ధనకీర్తియను జైన ధన్యుని మతమును ప్రతిభచే నలరు శ్రీపతి మతమును
మేటియైన వరాహ మిహిరార్యు మతమును-సన్మేఘమాలికా శాస్త్రమునను
నుదితకీర్త్యాఖ్యచే నొనరు నారాయణ-భట్టుమతంబును ప్రబలులైన
జనులయుక్తిని జ్యోతిష సారమునను-శకున నయమునఁ గల యర్థచయమున
కృతి యొనర్చిన రట్టని మతము నేను-వేడ్కఁ జెనిఁగించెదము ధీరు వేంకటేంద్ర

**End :**

చ. అనువుగ నబ్జభర్త మొదలై తగువారు శుభగ్రహంబులై
నను ధరణీతలంబున ననాగతమున్ మిగులన్ శుభంబె యొ
ప్పును వరుసన్ దదబ్దము బుట్టినొగిన్ విపరీతమొద్దియున్
జనతతికిన్ సుఖస్థితియొ సంధిలు తిమ్మయ వేంకటాధిపా !

మ. కపటారాతివిభంజనోద్యతమతీ కర్ణాటసింహాసనా
ధిపతిప్రాప్తరమాధురీణకరుణాబ్ధికంతుసౌందర్య శా
శ్వపసద్గోత్రపవిత్రకప్రమతరవాచానైపుణీనిర్జితా
హిపకామందక కావ్యనాయక కవీంద్రేష్టార్థ సంధాయకా !

స్రగ్విణి.

భానువంశాగ్రణీ బంధుచింతామణీ

* * * *

సూనృతోక్తిక్రియా శోభనైకాశ్రయా

Colophon :—

ఇది శ్రీమదొంటిమెట్ట రఘువీరకృపాలబ్ధసారసారస్వత ధుర్యాయ్యలు రాజవంశ సంభవాయ్యలాఖ్యభాస్కరాఖ్యకవిద్వయ ప్రణీతంబైన రట్టమత మహాకావ్యంబునందు పంచమాశ్వాసము.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పులు లేవు. శైథిల్య మత్యధికముగాఁ గలదు. గ్రంథపాతములు చాల హెచ్చుగాఁ గలవు.

కర్ణాటభాషలో 'రట్టుఁడను' శాస్త్రజ్ఞుఁడు రచించిన గ్రంథమున కిది తెలుఁగు సేఁత. ఇందు చెట్లపూతలనుబట్టి, పక్షికూతలనుబట్టి, ఇంక నితర విధములను, వాన రాకను గుర్తించుట మొదలగు కృష్యుపయుక్తవిషయము లనేకములు తెలుపఁబడినవి. ఉదాహృత గ్రంథభాగమున గ్రంథస్థ విషయముల వివరణము గానఁబడును. గార్గ్య, ధనకీర్తి, హరిభట్టు, శ్రీపతి, వరాహమిహిరుఁడు, నారాయణభట్టు అను శాస్త్రకారుల మతములను, మేఘమాలిక యను గ్రంథమును జూచి రట్టుఁడిద్దాని రచించెనట. ఈ తెలిఁగింపు మంచి తీరు గలది. ఒంటిమెట్ట రఘువీరశతకము రచియించిన అయ్యలు రాజు. త్రిపురాంతకుని (తిప్పని) వంశమువారయిన అయ్యలాఖ్య భాస్కరాఖ్య కవు లిర్వురు దీనిని రచియించిరి. వేంకటరామకృష్ణ కవులచే 'అభినవకామందకము'ను నీతిశాస్త్రమును కృతిగాఁ గొనినవాఁడును, అహోబలక్షేత్రధర్మనిర్వాహకుఁడును, ఆర్వీటివంశ్యుఁడును కొండ్రాజు తిమ్మరాజు పౌత్రుఁడును, పెదతిమ్మరాజు పుత్త్రుఁడును నగు వెంకటరాజు దీనికిఁ గృతిపతి. కృతిపతి వంశవర్ణనము ఈ లైబ్రరిలోని ప్రత్యంతరములలో లేదు. ఇందొక్కదాన మాత్రమే కలదు. అదియు నతి శిథిలముగా నున్నది గాన సర్వము నిందుఁ జూపఁబడినది.

## No. 2365. రట్టమతము.

### RAṬṬAMATAMU.

Substance, paper. Size, $10\frac{1}{2} \times 8\frac{3}{4}$ inches. Pages, 43. Lines, 31 on a page. Character, Telugu. Condition, injured. Appearance, very old. Mode of writing, fair but not free from mistakes.

Begins on fol. 29*a* of the Ms. described under D. No. 526.

Incomplete.

Same work as the above.

(వి-వి.)—

అసమగ్రము. అవతారిక కొంతగా నైదాశ్వాసములును గలవు. వ్రాఁత మంచిది. తప్పులున్నవి. శైథిల్యము చాలఁ గలదు. గ్రంథపాతములు గలవు.

పూర్వమువలె.

---

## No. 2366. రట్టమతము.

### RAṬṬAMATAMU.

Substance, palm-leaf. Size, $14\frac{1}{2} \times 1\frac{1}{2}$ inches. Pages, 88. Lines, 6 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, fair but not free from mistakes.

Complete.

Same work as the above.

(వి-వి.)—

సమగ్రము. గ్రంథావతరణికలోని కృతిపతి వంశవర్ణన మిందుఁ గానరాదు. అది యీ లైబ్రరిలోని ప్రతులలో నెం 2364 రు ప్రతిలో మాత్రమే కలదు. వ్రాఁత మంచిది. తప్పులంతగా లేవు.

పూర్వమువలె.

---

## No. 2367. రట్టమతము.

### RAṬṬAMATAMU.

Substance, paper. Size, $9\frac{1}{2} \times 6\frac{5}{8}$ inches. Pages, 52. Lines, 19 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, fair but not free from mistakes.

Incomplete.

Same work as the above.

(వి-వి.)—

అసమగ్రము. ఆద్యంతములు లేవు. ప్రథమాశ్వాసము తుదినుండి పంచమాశ్వాసమున కొంతదాఁకఁ గలదు. పీచు కాగితములు. వ్రాఁత మంచిది. శైథిల్యము గలదు. గ్రంథపాతములు గలవు.

పూర్వమువలె.

---

## No. 2368. రట్టమతము.

### RAṬṬAMATAMU.

Substance, paper. Size, $9\frac{7}{8} \times 7\frac{3}{8}$ inches. Pages, 6. Lines, 23 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, fair but not free from mistakes

Begins on fol 149*a* of the Ms. described under D No 402.

Incomplete.

Same work as the above

(వి-వి.)—

అసమగ్రము. పంచమాశ్వాసమునందలి యొక భాగము మాత్ర మిందు గలదు వ్రాఁత తిన్ననిదే. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతములు లేవు.

ఇందలి యితర గ్రంథములను డి. నెం 402 రున జూచునది.

---

## No. 2369. రట్టమతము

### RAṬṬAMATAMU

Substance, palm-leaf. Size, $14\frac{1}{8} \times 1\frac{5}{8}$ inches. Pages, 113. Character, Telugu. Condition, slightly injured. Appearance, old. Mode of writing, fair but not free from mistakes.

Begins on fol 1*a*. The other work herein is :—57*b*. Jyōtisaratnākaramu.

Incomplete.

Same work as the above.

(వి-వి.) —

అసమగ్రము. వ్రాఁత మంచిదే. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతము లల్పములు.

పూర్వమువలె.

## No. 2370. రాజయోగాది విషయము.

## RĀJAYŌGĀDIVIṢAYAMU.

Substance, palm-leaf. Size, 17¼ × 1⅜ inches. Pages, 7. Lines, 6 on a page. Character, Telugu. Condition, slightly injured. Appearance, old. Mode of writing, fair but not free from mistakes

Begins on fol. 26*a* of the Ms. described under D. No. 2356.

Complete.

What should be the position of the planets in one's horoscope for one to become a king is explained in this

**Beginning :**

శ్లో. నిశాకరే కేంద్రగతే విలగ్నే
తత్త్రికోణే యది జీవదృష్టే
శుక్రేణ యుక్తే బలపూర్ణయుక్తే
జాతో నరో భూపతి రాజతుల్యః.

**End :**

శ్లో. రవిగురుదిన పూర్వే సోమశుక్రే చ యామ్యే
జలధిదిగినభౌమే చోత్తరే సౌరిసౌమ్యే
ప్రతిదినమపి గత్వా కాళరాహుర్దిశానాం
వసతి సకలకార్యం వామపృష్ఠేర్థసిద్ధిః.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత మంచిది. తప్పులు చాలఁ గలవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

రాజయోగము కలుగఁదగిన గ్రహస్థితులు మొదలగువానిఁ దెలుపు జ్యోతిష శ్లోకములివి.

---

## No. 2371. రుధిరోద్గారి సంవత్సర పంచాంగము.

## RUDHIRŌDGĀRI SAMVATSARA PAÑCĀṄGAMU

Substance, palm-leaf. Size, 16 × 1¼ inches. Pages, 92. Lines, 5 on a page. Character, Telugu. Condition, injured Appearance, old. Mode of writing, fair but not free from mistakes.

Complete.

A calendar of the year Rudhirōdgāri

**Beginning :**

నిర్విఘ్నం సకుపాస్య హేరంబ హరం శంభుం విరించిం రమాం
అంబాం వాచమిభాననం ద్విజవరం నందీశ్వరం షణ్ముఖం

సూర్యాబ్జారబుధేజ్య భార్గవశని స్స్వర్భానుకేతు........
.... ......... ........ . ... .. దిక్పాలకాః.

**End :**

30 ఆ ౫౫-౬ శ ౯| సా ౨౪-౧౭ చ ౨౭-౧3.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత మంచిదే. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతములున్నవి. ఇందు రుధిరోద్గారి సంవత్సరమునకు సరియగు శాలివాహనశకమును పేర్కొన లేదు. కర్తపేరెఱుంగరాదు.

---

## No. 2372. రుధిరోద్గారి సంవత్సర పంచాంగము.

## RUDHIRŌDGĀRI SAMVATSARA PAÑCĀṄGAMU

Substance, palm-leaf Size, $8\frac{1}{2} \times 1\frac{3}{4}$ inches. Pages, 64. Lines, 7 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, not good and not free from mistakes.

Complete.

A Calendar for the year Rudhirōdgāri, corresponding to Ṣaka 1665 (1743 A.D ).

**Beginning :**

వాగీశాద్యాస్సుమనస స్సర్వార్థానాముపక్రమే
యం నత్వా కృతకృత్యాస్స్యుస్తం నమామి గజాననమ్.
శ్రీమత్తంజానగర్యాం విరచిత విహృతే శ్శాసతశ్శోళసీమాం
తత్రాద్యగ్భీ సలీయాన్వయ జలధివిధోః కేళి ధామ్నో గుణానాం
సింహాంకస్య ప్రతాపావనిపతితిలక స్యాజ్ఞయా సం ప్రణీతం
పంచాంగం నిష్కళంకం జగతి విజయతా మేతదాచంద్రతారం
శ్రీమత్తంజానగర్యాం చికితమునిలసద్గోత్రజస్సర్వమాన్యః
కామాక్ష్యంబాత్మజన్మా సుసరలకులజ స్సుబ్బయార్యస్య సూనుః
సీతారామాఖ్యసూరిః ప్రథితగుణనిధి స్సూర్యసిద్ధాంతరీత్యా
పంచాంగం భద్రదాయి ప్రతిశరదమసౌ కల్పయత్యార్యహృద్యం
అస్య సంవత్సరస్య శాలివాహనశకాబ్దాః ౧౬౬౫ కల్యబ్దాః ౪౮౪౪.

**End :**

౧ ఆ ౧౮ శ ౧౫-౯ శు ౬| బ ౧ రా ౧౭-౭ ధని ౨ శు ౪-౫౨.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత మంచిదే. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతములు గలవు.

శాలివాహనశకాబ్దము ౧౬౬౫ కు సరియగు రుధిరోద్గారి సంవత్సర పంచాంగమిది. తంజావూరిరాజగు భోసలప్రతాపసింహుని ప్రేరణచే సుసర్ల సీతారామసిద్ధాంతి దీనిని రచించెను.

---

## No. 2373. రౌద్రి సంవత్సర పంచాంగము.

## RAUDRI SAMVATSARA PAÑCĀṄGAMU.

**Substance, palm-leaf. Size, 9¾ × 1¼ inches. Pages, 74. Lines, 6 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, fair but not free from mistakes.**

Complete.

A Calendar for the year Raudri, corresponding to Śaka 1662 (1740 A.D).

**Beginning :**

అచింత్యావ్యక్తరూపాయ నిర్గుణాయ గుణాత్మనే
సమస్తజగదాధార మూర్తయే బ్రహ్మణే నమః.
రాజాధీశ్వర వీరరాజజలధి ఖ్యాతాగ్రహారస్థిత
స్వద్రాదీతరగోత్రవారిధిశశీనాగార్యపుత్రాగ్రణీ
సంఖ్యావద్గణపూజితం సువిమలం సత్సూర్య సిద్ధాంతతః
పంచాంగం ప్రతివత్సరం వితనుతే శ్రీభాస్కరాఖ్యస్సుధీః.

అస్య సంవత్సరస్య కలియుగగతాబ్దాః............... శాలివాహనశకాబ్దాః ౧౬౬౨.

**End :**

రా షు రరా జ్యే ౧ ......... అర్ఘవృద్ధి.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత మంచిదే. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతములున్నవి.

ఇది శాలివాహనశకాబ్దము ౧౬౬౨ కు సరియగు రౌద్రి సంవత్సర పంచాంగము. దీనికి కర్త భాస్కర సిద్ధాంతి. వీరరాజసముద్రమీతని వాసస్థానము.

---

## No. 2374. లెక్కలు.

## LEKKALU.

**Substance, palm-leaf Size, 14⅞ × 1⅝ inches Pages, 20. Lines, 6 on a page Character, Telugu. Condition, much injured. Appearance, old. Mode of writing, not good.**

Complete.

A work on the science of divination or horary astrology.

(వి-వి.)—

సమగ్రము. అన్నీ లెక్కలు. శైథిల్యము చాలఁ గలదు. గ్రంథపాతములు గలవు.

ఇదేదో ప్రశ్నశాస్త్రవిషయమగు పుస్తకము కాఁబోలును. అన్నియు సంఖ్యలు. గ్రంథాంతమందీ శ్లోకములున్నవి :—

శకాబ్దా ద్విగుణంచైవ నవతిర్భాగమాహరేత్
శేషంచ త్రిగుణీకృత్య రామపంచా ....
మష్టనిగ్రహపాలంచ సుఖందుఃఖ స్తథైవచ
మహోత్పాతమితశ్చైవ ...చైతేషాం గతన్యృతః ?

---

## No. 2375. వాస్తువిషయము (సటీకము).

### VĀSTUVIṢAYAMU (with Com.)

Substance, palm-leaf. Size, $16\frac{1}{4} \times 1\frac{3}{8}$ inches. Pages, 19. Lines, 5 on a page. Character, Telugu Condition, injured. Appearance, old. Mode of writing, fair but not free from mistakes.

Begins on fol. 1*a*. The other work herein is 11*a*. Amśalu.

Incomplete

This contains some Telugu stanzas from Kṛṣna Vāstu which is a Telugu rendering of the Sanatkumāra—Vāstu Śāstra. A few Sanskrit verses are also found in this.

**Beginning :**

శ్రావణాషాఢయోశ్చైవ రోహిణీ చోత్తరాద్వయమ్
ఆశ్రేషా మృగశీర్షం చ గురూణాం సహసంస్థితమ్.
గురువారే కృతం సేవ్యం రాజయోగమిహోచ్యతే
తద్గృహం జాతపుత్రస్య రాజ్యం భవతి నిశ్చితమ్.

* * * *

క. ధరశుద్ధతదియ మొదలుగ, సరసంబుగఁ గృష్ణపక్ష సప్తమిదాకా
సరియగు సితపక్షంబునఁ, బరగుఁ బ్రసిద్ధంబు బహుళ పక్షము కృష్ణా !

**End :**

మార్గశిరం పుష్యమాఘం ఈ మూడు మాసాలు దక్షిణం తలగడచేసి పడమర చూస్తూ వుండును. పడమట కంభాలుగాని శంఖుగా పాతేది. ఫాల్గునం చయిత్రం వైశాఖం ఈ మూడు మాసాలున్ను వాస్తుపురుషుఁడు పడమర తలగడచేసి ఉత్తరం చూస్తూ వుండును గనుక ఉత్తరాన స్తంభం పాతవలెను. జ్యేష్ఠం ఆషాఢం శ్రావణం

ఈ మూడు మాసాలున్ను వాస్తుపురుషుండు ఉత్తరం తలగడచేసి, తూర్పు చూస్తూ వుండును. అది గనక తూర్పున స్తంభం పాతవలెను.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాంత మంచిది. తప్పులు గలవు. శైథిల్యము లేదు. గ్రంథ పాతములు లేవు.

సనత్కుమారవాస్తు శాస్త్రమునకుం దెలుంగగు కృష్ణవాస్తువులోని పద్యములు గొన్ని సంస్కృత శ్లోకములుగొన్ని యిందుం గలవు

ఇంది యితర గ్రంథమున్నది :—

11-అ అంశలు.

---

## No. 2376. విక్రమ సంవత్సర పంచాంగము.

## VIKRAMA SAMVATSARA PAÑCĀÑGAMU.

Substance, palm-leaf. Size, 18½ × 1½ inches. Pages, 40. Lines, 6 and 7 on a page. Character, Telugu. Condition, slightly injured. Appearance, old. Mode of writing, not good and not free from mistakes.

Begins on fol. 46*a* of the Ms described under D. No. 2308.

Incomplete.

A Calendar for the year Vikrama, corresponding to Śaka 1742 (1820 A.D.). By Śivarāma Siddhānti

**Beginning :**

అచింత్యా వ్యక్తరూపాయ నిర్గుణాయ గుణాత్మనే
సమస్త జగదాధార మూర్తయే బ్రహ్మణేనమః.

* * * *

శ్రీగౌతమీసింధుతటే విభాతి శ్రీరాజమాహేంద్రవరాఖ్యదుర్గం
యస్యాధికారా న్మనుజాధినాథో భూలోకదేవేంద్ర ఇవావభాతి.

శ్రీరాజమహేంద్ర వరాఖ్యదుర్గే
శ్రీవెల్లకోటాఖ్య సుసీమసంస్థా
శ్రీమంత్రివర్యై స్సుగుణైస్సమేతా
శ్రీరామచంద్రాఖ్య పురీప్రసిద్ధా.

* * * *

యామధ్యాస్తే ఇదానీం
శ్రీరాజా రామచంద్ర ధరణీపాలః
దశరథతనయో యోధ్యాం
త్రేతాయాం మివజనాను రంజన చతురః.

కౌండిన్యగోత్రోద్భవ భాసమాన
శ్రీరామవిద్వాన్ పిడపర్తి వంశ్యః
శ్రీరామచంద్రాఖ్య పురేబభూవ
తపశ్శ్రీతాభ్యాం భువి సుప్రసిద్ధః.

ఆసీ దప్పన్నశాస్త్రీ బుధకవినికర స్తూయమాన స్తనూజః
తస్యాసీత్తస్యపుత్రః కృతినిచయసుధాపానభాస్వద్రసజ్ఞః
జ్యోతిశ్శాస్త్రప్రవీణ స్సకలగణిత విత్సూర్యసిద్ధాంత వేత్తా
శ్రీసీతారామపాదాంబుజరసలహరీ హారిచేతోమిళిందః.
తస్మిం త్సుధీవరమణి శ్శివరామ విద్వాన్
శ్రీరామచంద్రనగరే కృతనిత్యవాసః
శ్రీరామచంద్రజనపాల దయైకలక్ష్యః
పంచాంగమంచ దనువత్సరమాతనోతి.

* * * *

అస్య సమస్త కళ్యాణ భాజనస్య శ్రౌతస్మార్త నిత్యకర్మానుష్ఠాన క్రియాతంత్ర వ్యవహార హేతుభూతస్య విక్రమనామ సంవత్సరస్య కల్యాదిగత సౌరాబ్దః ........ .
కలియుగేగత సౌరాబ్దాః ౪౯౨౧ శాలివాహనశకేగత సౌరాబ్దాః ౧౭౪౨.

**End :**

౬ శ ౩-౪౯ పూ ౫౪ తై ౩-౪౯.

...... . .. .. . . . .

(వి-వి.)—

అసమగ్రము. వ్రాంత మంచిదే. శైథిల్య గ్రంథపాతములు గలవు.

శాలివాహనశకాబ్దము ౧౭౪౨ లకు సరియగు విక్రమ సంవత్సర పంచాంగ మిది. దీనిని పిడపర్తి శివరామసిద్ధాంతి రచించెను.

---

## No. 2377 శకున విషయము.

## ŚAKUNAVIṢAYAMU.

Substance, paper. Size, 7¼ × 6¾ inches Pages, 8. Lines, 28 on a page. Character, Telugu. Condition, slightly injured. Appearance, old. Mode of writing, not good and not free from mistakes.

Begins on fol. 2*a*. The other works herein are :—1*a*. Nrsimha-yantram, 6*a*. Cannamallu Sīsamulu, 8*a*. Mārkandēyastuti, 9*a*. Śaiva praśamsa, 11*b*. Kōpaśamanayantram, 12*a* Vaśyayantram.

Complete.

Explains the good or bad omens connected with sneezing, throbbing of the different parts of the body, the fall of the lizard on the different parts of the body, etc.

**Beginning :**

పోచిళ్లు.

ఆదివారేచ చండాలీ సోమవారేచ నర్తకీ
రజకీ కుజవారే చ బుధే విప్ర గృహంతథా ।
గురువారే సభామధ్యే శుక్రే పణ్యాంగణే తథా
శనివారే చ దాసీ చ ఇత్యుపశ్రుతిలక్షణమ్
ఈ చొప్పున ఈ వారాలు యెర్గి యిండ్లు యెర్గి పోచిళ్లు పట్టేది.
గౌళి పలికినందుకు తుమ్మినందుకు ఖఖలే ఫలం.

*  *  *  *

ఆదివారంనాడు తూర్పున రాహువుండును. తుమ్మినా గౌళి పల్కినా భయం కల్గును. ఆది దిక్కున చెడువార్త. ఆగ్నేయాన కేతువుండును. మరణవార్త.

**End :**

బల్లిపాటు.

కలహం శిరస్స్థానే లలాటే బంధుదర్శనమ్
భ్రూమధ్యే రాజసమ్మానం ఉత్తరోష్ఠే ధనక్షయః
అధరోష్ఠే ధనైశ్వర్యం నాసాగ్రే వేదిసంకులమ్

*  *  *  *

అద్వనం? దక్షిణేపాదే పాదబంధే వినాశనమ్

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత తిన్ననిది. తప్పులున్నవి. శైథిల్యము లేదు. గ్రంథ పాతములు లేవు.

పోచిళ్లు, గౌళిపల్కు, తుమ్ము, స్థానాస్థానాల అదురు, గార్దభశకునము, కాకి విష్ఠించిన ఫలము, బల్లితొండపాటు ఫలము, బల్లిపాటు ఫలము ఇందు వ్రాయఁబడినవి.

---

## No. 2378. శకున విషయము.

## ŚAKUNAVIṢAYAMU.

Substance, palm-leaf. Size, 14⅜ × 1⅜ inches. Page, 1. Lines, 8 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, fair but not free from mistakes.

Begins on fol *5a*. The other work herein is 1*a*. Gōpālākṣaramālika

Complete.

On the good and bad omens indicated by the cries of jackals, sneezing, etc., at the time of starting on a journey.

**Beginning :**

ఆదివారం॥ నక్క బల్లి కల్కు తుమ్మినందుకు దిక్కులకు ౮ కి వారాలకు ౭ కి ఒకటే ఫలము.

**End :**

౩ స్త్రీలాభం, ౪ విజయము, ౫ శుభం, ౬ అనర్థం, ౭ కలహం, ౮ మృత్యు.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిదే. శైథిల్య గ్రంథపాతములు లేవు.

ప్రయాణసమయమున నక్క కూతకు బల్లి పలుకునకు, తుమ్ములకును ఫలము లిందు చెప్పఁబడినవి.

ఇందలి గ్రంథాంతరము :—

1a గోపాలాభరమాలిక.

---

## No. 2379. శకున విషయము.

## ŚAKUNAVIṢAYAMU.

**Substance, palm-leaf. Size, 5¼ × ⅞ inch. Pages, 68. Lines, 5 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, old. Mode of writing, fair but not free from mistakes.**

Begins on fol 22*a*. The other work herein is :—1*a*. Kaḍupunophi modalaguvāniki cikitsalu.

Incomplete.

Explains the good or bad omens indicated by the sound of a lizard, and sneezing.

**Beginning :**

గౌళి శకునము.

అరయఁగ తూర్పున నాలస్య మొనరించు నాగ్నేయ.......... ..
దక్షిణంబున మంచి ధనలాభ మొస .. . ...... . ...
........................ ...... .. ........ ...
పడమట కలహంబు ... ........... ..... .. ..

* * * *

**End :**

౧ జామున మేలు.
౨ జామున మేలు వార్త.

| | |
|---|---|
| ౩ జామున | కలహము. |
| ౪ జామున | శుభము. |

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత మంచిదే. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతము లమితములు.

గౌళికలకు తుమ్ముల ఫలములిందు వివరింపఁబడినవి.

పూర్వమువలె.

ఇందలి గ్రంథాంతరము :—

1a కడపు నొప్పి మొదలగువానికి చికిత్సలు.

---

## No. 2380. శకున విషయము.

## ŚAKUNAVIṢAYAMU.

Substance, palm-leaf. Size, 7⅝ × 1½ inches. Pages, 37. Lines 4 on a page Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, fair but not free from mistakes.

Begins on fol. 2*a* of the Ms described under D. No. 2320.

Complete.

Similar to the work described under D. No. 2354 ante.

**Beginning :**

దక్షిణము.

శ్రీరాములు వారువనాన అనంతవిజ్ఞాపం శేషినాడు (?) కార్యసిద్ధి

| | |
|---|---|
| జామున | విఫలం. |
| జామున | శుభం. |
| జామున | చుట్టాలు వత్తురు. |
| జామున | మరణం. |
| జామున | ఫలం కల్గును. |
| జామున | కలహం విందురు. |
| జామున | వార్త విందురు. |
| జామున | |

**End :**

ఈశాన్యం.

హనుమంతుడు అమ్మవారి క్షేమమునకుబోయి లంకారాజ్యం కాల్చినాడు కార్యానుకూలం.

| | |
|---|---|
| జామున | మరణం. |
| జామున | మేలు వార్త. |

జాామున — కలహం.

జాామున — జార్త వింమరు.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతములు గలవు.

శకున విషయమిందు గలదు. ఇది డి నెం 2354 రున వర్ణింపఁబడిన గ్రంథము వంటిదే. కర్త పేరెఱుఁగరాదు.

ఇందలి గ్రంథాంతరములను డి నెం2420 రున జూచునది.

---

## No. 2381 శ్రీముఖ సంవత్సర పంచాంగము.

## ŚRĪMUKHA SAMVATSARA PAÑCĀÑGAMU.

Substance, palm-leaf. Size, 9¾ × 1¼ inches. Pages, 56. Lines, 8 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, fair but not free from mistakes.

Incomplete.

A Calendar for the year Śrīmukha.

**Beginning :**

క్రీడార్చనోద్య త్ఫలపత్రఖా శ్రీముఖా
బ్దే వనితే ...... ఖాతి। బార్హస్పత్యాబ్దఫలం.

**End:**

30 గు 3౯ ఉ ౪౦ బ్ర ౪౦ చ ౯ ది ౨ అహ 30 ౧ శు ౪౦ ............

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత తిన్ననిదే. శైథిల్య గ్రంథపాతములున్నవి.

ఇది శ్రీముఖ సంవత్సర పంచాంగము. మొదటి యాకు పోయినందున కర్త పేరెఱుఁగరాదు.

---

## No. 2382. షడ్వర్గ టీక.

## ṢAḌVARGAṬĪKA.

Substance, palm-leaf. Size, 17¼ × 1⅝ inches. Pages, 24. Lines, 6 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, fair but not free from mistakes.

Begins on fol. 13*a* of the Ms. described under D. No. 2356.

Complete.

The Ṣaḍvargas, which are very essential for the preparation of horoscopes, are dealt with in this. It contains the original Sanskrit verses with Telugu meaning.

**Beginning :**

త్రింశద్భాగాత్మకం లగ్నం హోరాతు స్యాత్తదర్ధకమ్ ।
లగ్నత్రిభాగో ద్రేక్కాణః నవాంశో నవమస్తథా ॥
ద్వాదశాంశో ద్వాదశాంశః త్రింశాంశ స్త్రింశదంశకః. ।

లగ్నం విఘడియలు చేసి 30 భాగాలు చేస్తేను త్రింశాంశమనిపించుకొనును. లగ్నం రెండు భాగాలు చేస్తేను హోరాలగ్నం 3 భాగాలు చేస్తేను ద్రేక్కాణంలగ్నం 9 భాగాలు చేస్తేను నవాంశంలగ్నం 12 భాగాలు చేస్తేను ద్వాదశాంశలగ్నం 30 భాగాలు చేస్తేను త్రింశాంశ.

**End :**

ఈ ప్రకారాన షడ్వర్గు చేయఁగాను శుభగ్రహాలు వచ్చిన వివరం. లగ్నాధిపతి ర్గురుః హోరయందు 1 భాగకు చంద్రః ద్రేక్కాణయందు ఒక భాగకు చంద్రః నవాంశలయందు రెండు భాగాలుమీద బుధః ద్వాదశాంశయందు మూడు భాగాలలోను 14 విఘడియలు చెల్లగాను శుక్రః ఆ మీద బుధః త్రింశాంశయందు 7 భాగలలోను రెండు విఘడియలు చెల్లఁగా బుధః అంతు మీనం 54 విఘడియలమీఁద 26 విఘడియల పర్యంతం పుష్కర షడ్వర్గుశుద్ధిః.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పులున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

జ్యోతిష జాతక భాగమునఁ బ్రసిద్ధమును, జాతక పరిగణనమునకు ఆవశ్యకమునగు షడ్వర్గు విధానమిందు వివరింపఁబడినది. సంస్కృత మూలముకూడ నిందు గలదు.

---

## No. 2383. షడ్వర్గ టీక.

## ṢAḌVARGAṬĪKA.

Substance, paper. Size, 12¼ × 7¾ inches. Pages, 18. Lines, 24 on a page. Character, Telugu. Condition, good. Appearance, old. Mode of writing, good but not free from mistakes.

Begins on fol. 64*a* of the Ms. described under D. No. 1487. Complete

Same work as the above.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిది. శైథిల్య గ్రంథపాతములు లేవు.
పూర్వమువలె.

ఇందలి గ్రంథాంతరములను డి. నెం. 1487 రు జూచునది.

---

## No. 2384. సర్వతోభద్రచక్రము (సటీకము).

## SARVATŌBHADRACAKRAMU (SAṬĪKAMU)

Substance, palm-leaf. Size, 17¾ × 1½ inches Pages, 25 Lines, 6 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, fair but not free from mistakes

Begins on fol. 24*a* of the Ms. described under D. No. 2335.

Incomplete.

On the drawing of a mystic diagram called Sarvatōbhadracakra for the purpose of divination

**Beginning :**

అథాతస్సం ప్రవక్ష్యామి చక్రం త్రైలోక్యదీపకం।
విఖ్యాతం సర్వతోభద్రం సర్వప్రత్యయ కారకమ్॥
టీక. త్రైలోక్య దీపకమైన సర్వతో భద్రము చెప్పెదను.
ఊర్ధ్వగా దశవిన్యస్య తిర్యగ్రేఖా స్తథైవచ।
ఏకాశీతి పదం చక్రం జాయతే నాత్ర సంశయః?

టీక. చక్రోద్ధారణ ప్రకార మెట్టిదన్నను, నిడుపుగా ౧౦ రేఖలున్ను, అడ్డముగా ౧౦ రేఖలున్ను వ్రాయగా సింద్లు ౮౧ అగును.

* * * *

**End :**

కేతుర్థాన్యాది . . . స్త్రీ కరేరాజభయాదికం।
శనివత్కుజవద్రాహుః కేతు శుభాశుభం॥ ?

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత తిన్ననిదే. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతములు లేవు.

జాతకుని భవిష్యచ్ఛుభాశుభముల నెఱింగించు జ్యోతిష విషయము లీచక్రోద్ధార క్రమమున చెప్పబడినవి. కర్తపేరెఱుఁగరాదు. దీనిని గూర్చి సంస్కృతమున డి. నెం. 13996, 14001 ర్లను జూచునది.

చివర 2 పుటలలో శకున విషయము గలదు.

ఇందలి గ్రంథాంతరములను డి. నెం. 2335 రున జూచునది.

## No. 2385. సస్యానందము.

## SASYĀNANDAMU.

**Substance, paper. Size, 13½ × 8½ inches. Pages, 44 Lines, 22 on a page. Character, Telugu. Condition, slightly injured. Appearance, old Mode of writing, fair but not free from mistakes.**

Complete

Describes several topics useful to agriculturists, such as the characteristics of rain, its effects, etc The author is Dōnayāmātya. It is stated in this Ms. that he wrote the work in the Śaka year 1278 corresponding to 1356 A D The style, etc , also appear to be old The work has been dedicated to God Mallikārjuna at Śrīśaila.

**Beginning :**

క శ్రీనగమందిరు గౌరీ, మానసవనజాతలోభమధుపేంద్రుని ని
త్యానందమూర్తి శంకరు, నానతవాగీశు మల్లికార్జునిఁ గొలుతున్.

గీ. వానచేత సస్యవర్ధంబు వర్ధిల్లు-సస్యవృద్ధిసకల జనసమృద్ధి
కారణంబు వాన కావున ధరలోన-వానవలయునెల్ల వారలకును.

క. సదమలవాక్యస్ఫురణము, సదలాలిత్యంబుఁ జూచి ప్రాజ్ఞులు మెచ్చన్
ముదమున సస్యానందము, వదలక రచియింతునెల్ల వారలు మెచ్చన్.

సీ. వసుసంఖ్యఁ బెంచిన వరశకాబ్దంబులు-తెలఁగొప్ప నవి తొమ్మిదింటపాలు
పుచ్చిన శేషంబు పొలుచునా వర్తంబు-ఘోరిసంవర్తంబు పుష్కరంబు
కమనీయద్రోణంబు కాలమేఘుంబును-నీలారువారుణ నీరదంబు
అను నామములుగల్గు నభ్రంబులగువాని-గర్భధారణమును గర్భపాత
కాలములు మఱి శరిపక్వ కాలఫలము-తెలిపి వర్షంబు చెప్పక తెంపుచేసి
నోరఁ గొలఁదులు వల్కెడువారు రాచ-సభల నపహాస్యపరులౌట సందియంబె.

వ. ఇది మేఘనిర్ణయం. ఇంక ధాతుప్రకారం బెట్టిదనిన.

* * * *

గీ. ఏ గ్రహంబులయిన విగ్రహశీలులై-చంద్రుడూఱి యుదియుఁ జనిరేని
వానకాలమేని వానలు గలుగవు-రెండు కాలమేని నొందు బాధ !

గీ. భూమిపుత్త్రుఁ గప్పి సోముండు నడచిన-నాహవంబు భూమి నావహిల్లు
జారచోరభయము శిథిలంబుగాకుండ ?-జనులకెల్లఁ గలవు చాలఁగల్గు.

గీ. రెండు మూఁడు గ్రహములుండఁగఁ బరివేష-మండలమునఁ జంద్రుఁడుండెనేని
మండలాధిపతులు మడియుదురొండేని-కొండలదర వాన గురియుచుండు.

**Colophon :**

ఇది సకల జనస్తుత్యదోనయామాత్యప్రణీతంబైన సస్యానందంబు నందు చతుర్థాధికారము.

క. కరినగదినకరశశివ, త్సరములు భువిఁ బరగుచుండ సస్యానందం
బిరవుగ శ్రీగిరినాథున, కరుదుగ రచియించె దోన యామాత్యుఁడిలన్.

**End :**

క. అరువది సంవత్సరముల, కరియంబడి రెండు యుగములయ్యెను సంవ
త్సరమునకు నారు ఋతువులు, శిరుటింపఁగ దాని విధము సింహాద్రిన్నవా !

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత చక్కనిది. తప్పులు గలవు. వ్రాఁతలో గ్రంథభాగములు ముందు వెనుకలుగా నున్నవి. చతుర్థాధికారము, గద్యము పిదప నడిమి గ్రంథభాగము కొంత వ్రాయఁబడినది

వర్ష లక్షణములు, దాని పరిమాణములు, ఉత్పాతసూచకములు మొదలగు విషయము లిందుఁ గలవు. గ్రంథకర్త దోనయామాత్యుఁడు. ఇతఁడీ గ్రంథమున శక 1278 అనగా క్రీ 1356 లో రచియించిన ట్లింపుఁగలదు. గ్రంథరచనా విధానముగూడ నంత వ్రాఁతదిగానే కానవచ్చుచున్నది. ఈ గ్రంథము శ్రీశైల మల్లికార్జునాంకితము. కొన్ని పద్యములందు "సిద్ధవటపురీశ" అనియు గలదు. ఈ గ్రంథము ఆర్. నెం. 125, 266 రులందుఁగూడ వర్ణితము. అందు నెం. 266 రున వర్ణితమగుదాన గ్రంథకర్తృవిషయము వేఱుతీఱుగా నున్నది. అది సరియయినది కాకపోవచ్చును పెక్కుపట్టుల నీ ప్రతిలో నున్నతీరుననే గ్రంథకర్తృవిషయము గలదు. గ్రంథాంతమున 6 పుటలలో నున్నయ జ్యోతిషరత్నాకరములోని పద్యములుగలవు.

---

## No. 2386: సస్యానందము.

## SASYĀNANDAMU.

**Substance, palm-leaf. Size, 17¾ × 1½ inches. Pages, 30 Lines, 7 on a page. Character, Telugu Condition, slightly injured. Appearance, old Mode of writing, fair but not free from mistakes.**

**Begins on fol. 1*a* The other works herein are 15*a* Jyōtisaratnākaramu, and 34*b* Samvatsaraphalamu.**

Complete.

Same work as the above.

**Beginning :**

క శ్రీనగమందిరు గౌరీ, మానసపంకరుహాలోల మధుపేంద్రుని ని
త్యానందమూర్తి శంకరు, నానత వాగీశు మల్లికార్జునుఁ గొలుతున్.

క. సదమలవాక్యస్ఫురణము, పదలాలిత్యంబుచూచి ప్రాజ్ఞులు మెచ్చన్
ముదిమున సస్యానందము, వదలక రచియింతు విబుధ వర్గము పొగడన్.

**Colophon :**

ఇది సకల జనస్తుత్యదోనయామాత్యప్రణీతంబైన సస్యానందంబునందుఁ జతుర్థాధికారము

* * * *

క. ఈ సస్యానందము దగ, భూసురముగ గ్రాహగతియుఁ బరమార్థముగా
భూసురులు మెచ్చ నీకృతి, వాసనరాఁ దీర్చి లింగవర్యుఁడు చెప్పెన్

క. వరవసుధీశకశకవ, త్సరములు దివిఁ బెరుగుచుండ సస్యానందం
బరయఁగ శ్రీగిరినాథున, కరుదుగ రచియించెదోన యామాత్యుఁ డిలన్.

**End :**

క. క్షయసంవత్సరమందును, భయమగు దుర్భిక్షమని నృపాలురు నరులున్
ప్రియమొదలి కీడుఁ దలతురు, జయమగు కాళింగ విదుర సౌరాష్ట్రములన్.

గ్రంథాంతమందీ వ్రాఁతగలదు :—

" అక్షయనామ సంవత్సర ఫాల్గుణ బ 30 లు వజీరు బొల్లాప్రెగడ పేరాజు వ్రాసెను. "

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పులంతగా లేవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

పూర్వవర్ణిత గ్రంథమే. కాని గ్రంథాంతమందు గ్రంథకర్త పేరు గలదిగా అసందర్భపు పద్యములు గ్రంథరచనాకాలము దెలుపునవిగా గలవు. ఇవి ప్రామాణికములు గావు.

ఇందలి గ్రంథాంతరము :—

15a జ్యోతిషరత్నాకరము. 34b సంవత్సర ఫలము.

---

## No. 2387. సస్యానందము.

## SASYĀNANDAMU.

Substance, palm-leaf. Size, 8 × 1⅜ inches Pages, 73. Lines, 5 or 6 on a page. Character, Telugu Condition, very much injured. Appearance, old. Mode of writing, fair, but not free from mistakes.

Complete.

Same work as the above.

(వి-వి.)—

సమగ్రము. అవతరణిక లేదు. వ్రాఁత తిన్ననిదే. తప్పులున్నవి. శైథిల్యము చాలఁ గలదు. గ్రంథపాతములు చాలఁ గలవు.

గ్రంథాంతమందీ వ్రాఁతగలదు :—

క. ఈ సస్యానందమునకు, భాసురముగఁ గ్రమము తెలిసి పరమార్థముగా
నీసుడిగి తెలియఁగుడని స్మృతి, శాసనమందవరలింగ పర్యుఁడు చెప్పెన్.

"ప్రభవ సంవత్సర వైశాఖ శుద్ధ 12 సోమవారంనాఁడు కావలి వెంకటలక్ష్మయ్య గారికి వరిగె హెన్నా జోస్యులు వ్రాసియిచ్చిన గర్భబుధాతువుల పుస్తకానకు మంగళం."

ఇది పూర్వవర్ణితమే కాని, గ్రంథకర్తృ విషయమయినదిగాఁ గడపటి పద్య మొకటి గలదు.

## No. 2388. సస్యానందము.

## SASYĀNANDAMU.

Substance, paper. Size, 10¼ × 7¼ inches. Pages, (20 + 4) = 24. Lines, 16 on a page. Character, Telugu. Condition, injured Appearance, old. Mode of writing, fair, but not free from mistakes.

Begins on fol. 91*b* of the Ms described under D. No 1698

Incomplete.

Same work as the above

(వి-వి.)—

అసమగ్రము ఇందుఁ బ్రథమాశ్వాసము మాత్రమే కలదు. అందు తొలి పద్యము 72 ఉండవలసిన కాగితములు లేవు. వ్రాఁత తిన్ననిది. తప్పులున్నవి శైథిల్యము గలదు. గ్రంథపాతము లెడ నెడఁగలవు. వ్రాఁత పిచుకాగితములపై ఒక్కపక్కనే కలదు.

పూర్వమువలె.

ఇతర ప్రతులలో నాల్గధికారములుగానున్నది. ఇందొక యాశ్వాసముగానున్నది. ఇదే భేదముగాని గ్రంథ మొక్కటే. గ్రంథకర్త పేరిందు 'దోనయామాత్య' యనుటకు బదులు 'దొడ్డయామాత్య' యని కలదు. అద్దంకి లింగయ పేరి పద్యముఁగూడ నిందుఁ గలదు. ఆతఁడీగ్రంథమును బ్రచారమునకుఁ దెచ్చినవాఁడు గావచ్చును.

## No. 2389 . సస్యానందము.

## SASYĀNANDAMU.

Substance, paper. Size, 9⅞ × 7⅞ inches. Pages, 32 Lines, 24 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, fair, but full of mistakes.

Begins on fol. 133*a* of the Ms. described under D. No. 402.

Complete.

Same work as the above.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పులు గలవు. శైథిల్యము లేదు. గ్రంథ పాతములు లేవు.

పూర్వముద్రితము.

ఇందలి గ్రంథాంతరములను డి. నెం. 402 లోన జూచునది.

---

## No. 2390. సస్యానందము.

### SASYĀNANDAMU.

Substance, palm-leaf Size, $14\frac{5}{8} \times 1\frac{1}{4}$ inches. Pages, 58. Lines, 5 on a page. Character, Telugu. Condition, slightly injured. Appearance, old. Mode of writing, fair, but not free from mistakes

Complete.

Same work as the above.

(వి-వి.)—

సమగ్రము ప్రథమాశ్వాసము మాత్రము గలదు. ఇతర ప్రతులలో నాలుగధికారములుగానున్న గ్రంథమే యిందొక్క యాశ్వాసముగా నున్నది ఇందు 176 పద్యములు గలవు ఆశ్వాసాంత గద్యము తర్వాత మఱికొన్ని పద్యములున్నవి. అవియు గ్రంథాంతరములే కాఁబోలును వానితోఁ గూడిన పద్యసంఖ్య 23 అగును. కొంచెము శైథిల్యము గలదు గ్రంథపాతము అల్పముగాఁ గలవు. వ్రాఁత మంచిది. తప్పులున్నవి.

పూర్వముద్రితము.

---

## No. 2391. సాముద్రికము.

### SĀMUDRIKAMU.

Substance, paper. Size, $10\frac{1}{2} \times 8\frac{3}{4}$ inches. Pages, 23. Lines, 27 on a page. Character, Telugu. Condition, very injured Appearance, old. Mode of writing, fair, but not free from mistakes.

Begins on fol. 17*a* of the Ms described under D No. 332.

Complete.

A Telugu rendering of the Sanskrit work written by Prahlāda in two chapters dealing with male and female palmistry The author is Annāmātya of Bhāradvāja Gōtra, son of Mārayāmātya The work is dedicated to Kasuvāmātya, son of Rēcamāmba and Lingamantri.

**Beginning :**

క. హరిభక్తుఁడు ప్రహ్లాదుఁడు, సరసులు గొనియాడఁ జెప్పె సాముద్రిక వి
స్తరశాస్త్రము విను చెప్పెదఁ, గరుణారసభరితనిత్య కసువామాత్యా !

సీ. ఐదు దీర్ఘంబులు హ్రస్వంబు లొగినాల్గు-నైదు సూక్ష్మంబులు నంత వెలయ
నిరువురాఁడు పాదపులు నేడెత్తుఁదనము వి-స్తీర్ణముల్ మూఁడునై వెలయువలయు
గంభీరములు మూఁడు గలిగి పొల్పారిన-పరమాయురారోగ్య భవ్యమహిమ
నరుఁ డుల్లసిల్లు నున్నతరాజ్యపదమునఁ-దనరారునది యొట్టిదనిన వినుము
లక్షణంబులు వేర్వేఱ లలితబుద్ధి-శాస్త్రపద్ధతిఁ జెప్పెద సరవితోడ
భారతీభోజ గేచమాంబాతనూజ-రసికమందార ! లింగయ కసువధీర !

క కరములు నేత్రయుగంబును, సరసహనువు నాలుకయును చన్నులు నడుముగ్
నరునకు దీర్ఘముల యునను, కరమరుదుగ లక్ష్మినేలు కసువనమంత్రి !

క కరశాఖలు దర్కముబును, శిరోజములు దంతములును జెలువగు నఖముల్
నరునకు సూక్ష్మములయినను, గరమరుదుగ లక్ష్మినేలుఁ గసువనమంత్రీ !

* * * *

సిరియును వెసఁబొందుఁ గసువసేనాధీశా

* * * *

లలిత శ్రీకంఠగురుదయా కవితగాత్ర
మహిని గౌరన లింగయ మంత్రి కసువ !

* * * *

వినుత శ్రీపార్వతీశ విభవ పరీశా !

క. కోరుకూ- పురవరేశ్వర, నాయక కసువాంకభోగ నాకేశసమా !

* * * *

చిరతర శుభగాత్రా సింగమాంబాకళత్రా.

**End :**

క ఘనకాశ్యపాన్వయాంబుధి, వనరాశితనూజదాన వాసవ భూజా
దినరాజసదృశ తేజా, మనుచరిత సుధామ కసువ మంత్రిలలామా !

* * *

మాలిని. సుగుణమణిసముద్రా సుస్థిరైశ్వర్యరుద్రా
జగదధినుతకీర్తి సత్యధర్మప్రవర్తీ
విగతదురితబంధా . . . .
గగనమణిసమానా గాఢతేజోనిధానా !

**Colophon :**

ఇది శ్రీమాధవీదేవీ ప్రసాద లబ్ధకవితావిశారద శ్రీమదాంగీరస బార్హస్పత్య
భారద్వాజగోత్రపవిత్ర మారనామాత్య పుత్ర సకల విద్యావిధేయ అన్నయనామధేయ

వణితంబైన సాముద్రిక శాస్త్రంబునందు స్త్రీ లక్షణప్రకారంబన్నది ద్వితీయాశ్వాసము.

(వి-వి.) —

సమగ్రము. కృత్యవతరణిక లేదు. వ్రాఁత మంచిది. తప్పులున్నవి. శైథిల్యము గలదు. గ్రంథపాతములు గలవు.

స్త్రీ సాముద్రికమని పురుష సాముద్రికమని రెండు భాగములు రెండాశ్వాసములు గాఁగల యీ గ్రంథము సంస్కృతమున ప్రహ్లాదరచితమగు గ్రంథమునకుఁ దెలుఁగు సేఁత. కర్త భారద్వాజగోత్రుఁడు మాధయామాత్యపుత్త్రుఁడు నగు నన్నామాత్యుఁడు. కాశ్యపగోత్రుఁడును రేచమాంబాలింగమంత్రుల పుత్త్రుఁడగు కసువామాత్యుని కంకితముగా నీ గ్రంథము గలదు. ఈ కృతికిఁ గృత్యవతరణిక గానరాదు. ఉదాహృతపద్య భాగములఁబట్టి విశేషము తెలుఁగనగును.

ఇందలి గ్రంథాంతరములను డి. నెం. 332 దున జూచునది.

---

## No. 2392. సాముద్రికము

## SĀMUDRIKAMU.

Substance, palm-leaf. Size, 13½ × 1¼ inches Pages, 37 Lines, 5 and 6 on a page. Character, Telugu Condition, injured Appearance, old. Mode of writing, fair, but not free from mistakes

Complete

Same work as that described under R Nos 149 and 933. By Annaya

(వి-వి.) —

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పులు గలవు. శైథిల్యము చాలఁ గలదు. గ్రంథపాతము లత్యధికముగాఁ గలవు.

ఇది ఆర్. నెం 149, 933 లలో వర్ణితమయినది. అన్నయకవి కృతము.

---

## No. 2393. సాముద్రికము.

## SĀMUDRIKAMU

Substance, palm-leaf Size, 16½ × 1¼ inches Pages, 12 Lines, 7 on a page Character, Telugu Condition, slightly injured. Appearance, old. Mode of writing, not good and not free from mistakes

Complete

Same work as the above.

(వి-వి.)—

సమగ్రము. వ్రాత మంచిదిగాదు. తప్పులున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

పూర్వమువలె.

గ్రంథాంతమందీ వ్రాతగలదు :—

"ఈ ధర్మైబ్రహ్మనిమిది చద్వుల మల్లయ్యగారి ప్రతిని మాదేటి జోగి వ్రాసెను."

---

## No. 2394. సాముద్రికము

### SĀMUDRIKAMU

Substance, palm-leaf. Size, 17 × 1¼ inches Pages, 25. Lines, 7 on a page Character, Telugu Condition, very injured Appearance, old Mode of writing, fair, but not free from mistakes.

Complete.

Same work as the above, but with different readings

**Beginning :**

క. హరిభక్తుఁడు ప్రహ్లాదుఁడు, సరసులు కొనియాడఁజెప్పె సాముద్రిక వి
స్తరశాస్త్రము విను చెప్పెద, కరుణారసభరితనిత్య కనువామాత్యా !

**End :**

చ. తిరముగ రెండువంకలను దీర్ఘములై కడు రోమరాజి పెం
పరుదుగనుండెనేని నరుఁడద్భుత శ్రీఘతనొందుఁ బంచతన్
బరువడినట్లుగాకయును భామధనంబును సర్వధాన్యమున్
బొరిఁబొరిఁ జోర.. మికను బొందు నిజంబు నితాంతవేదనన్.

క. చేతులు పదములు పదవము, లాతతముగ నొందియున్న నయ్యంగన వి
ఖ్యాతిని మంగళయుతగా నీతిన్ బ్రకాశ్యుఁడఁడుగ నెమ్మిన్ జెప్పెన్.

(వి-వి.) —

సమగ్రము. వ్రాత తిన్ననిది. తప్పులున్నవి. శైథిల్యము గలదు. గ్రంథపాతములు గలవు.

పూర్వవర్ణితము కాని యిందు పాఠభేదములు చాలనున్నట్లున్నవి. ఇతర ప్రతులతో సరిచూడవలసినది

---

## No. 2395. సాముద్రికము (సటీకము)

### SĀMUDRIKAMU (with meaning).

Substance, palm-leaf. Size, 15⅝ × 1¼ inches. Pages, 108. Lines, 5 on a page. Character, Telugu. Condition, slightly injured. Appearance, old. Mode of writing, fair but full of mistakes.

Complete.

A work on male and female palmistry.

**Beginning :**

క. శ్రీమద్గౌరీమానస, తామరసప్రసవతీర్థామాక్లిష్టో
ద్దామహిమధామునతను, త్రామా నాగేశలింగ ద' జవిభంగా ?

వ. అవధరింపుము.

సీ. శకునంబు తెలుఁగుల సాముద్రికంబును-స్త్రీల శుభాశుభ చిహ్నములును
పురుషుల భాగ్యవిస్ఫూర్తియు సతులకు-మచ్చలక్షణములు మఱియు సుళ్లు
పరిణయయోగ్య సౌభాగ్యసంపత్తియుఁ-బయనంబులగు లగ్నఫలములవియు
నధలును బుటులఁ జ సరవినుత్సలయింటు-బుట్టి తద్యాంతి ? పూజనముల
నాదిగాఁగల్గు నఖిలంబు నభినుతింతు-దేవ నీకాదరింపుము దివ్యచిత్త
మందుఁ ద్రిపురదైత్యహరణ గౌరీనాథ-భక్తవనజమిత్ర ఫాలనేత్ర !

**End :**

పైని నెక్కుడనున్నఁ బ్రతవించు నాతండు
పండితుండగుఁ బట్టభద్రుఁడగును
ఎన్ని గుణములు నరునకు నున్న గుణము
ఇన్ని లోపల లక్షణం బెన్నఁజాల
గలుగు నుదుటను వ్రాసిన క్రమము దెలియ
జాల నూరేళ్లు నరుగాన నర్ష మింద్రు
వీటి సంజ్ఞను నరులకు నెఱుఁగఁజెప్పి
నట్టి ఋషిప్రోక్తమయిన గీర్వాణమునను
తెనుఁగు గావించి చెప్పితిఁ దేటపడఁగ.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిది. తప్పులు చాలఁ గలవు. శైథిల్యము గలదు. గ్రంథపాతములు గలవు.

శకున విషయము, సాముద్రికము అదే మరల అర్థముతోను, స్త్రీ సాముద్రికమని పురుష సాముద్రికమని మగల మఱొక తెలుఁగునను, నిందుఁ గలవు. కనుపమంత్రి సాముద్రికము నిందు గలసియున్నది.

---

## No. 2396. స్వప్నాధ్యాయము.

## SVAPNĀDHYĀYAMU.

**Substance, paper. Size, 6½ × 9 inches. Pages, 17. Lines, 23 and 24 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, not good and not free from mistakes.**

Complete.

Explains the good and bad effects of dreams It contains the Telugu meaning for the original Sanskrit verses.

**Beginning :**

స్వప్నాధ్యాయం ప్రవక్ష్యామి శుభాశుభవినిశ్చయమ్
సర్వదుస్స్వప్నశమనం సర్వసంపత్కరం భవేత్.

టీక. స్వప్నాధ్యాయం చెప్పేను శుభాశుభ నిశ్చయంగా సర్వమైన దుస్స్వప్నాలు శమించేటట్టున్ను సర్వసంపత్కరం కొలుకున్ను

స్వప్నస్తు ప్రథమే యామే సంవత్సర శుభాశుభమ్
ద్వితీయే చాష్టభిర్మాసైః తృతీయే చార్ధవత్సరః.
అరుణోదయవేళాయాం దశాహేన ఫలం లభేత్
గోవిసర్జనవేళాయాం సద్యస్స్వప్న ఫలం లభేత్.

తొలిజామున కలకంటే సంవత్సరానకు శుభాశుభం కనిపించును. రెండోజామున యెనిమిది నెలలకు అగపడును, మూడోజామున ఆరు నెలలకు అగుపడును. సూర్యోదయవ్యాళ అయినా అప్పుడే ఫలం కనిపించును

యస్తు పశ్యతి స్వప్నాంతే రాజానం కుంజరం హయమ్
సువర్ణవృషభౌగాశ్చ కుటుంబం తస్యవర్ధతే.

**End :**

శాల్యన్నం ఘృతసంయుక్తం సౌవర్ణే యస్తు పాత్రకే
భుక్త్వా స్వప్నే విబుధ్యేత ఆయుశ్శ్రీ కీర్తివర్ధనమ్.

వరిఅన్నం నేతితోకూడా బంగారుపాత్రలో భోజనంచేసినట్టుగా కలగన్నా వారికి ఆయుర్వృద్ధిన్ని కీర్తిన్ని ఐశ్వర్యమున్ను ఆయుర్వృద్ధులున్ను కలుగును.

సర్వాణి శుక్లాన్యతిశోభనాని కార్పాసహస్తి దధినీచవర్జం
సర్వాణి కృష్ణాన్యతినిందితాని గోహస్తసప్తా ద్విజరాజవర్జం
ఆరోహణం గోవృషకుంజరాణాం ప్రాసాదశృంగాగ్రవనస్పతీనామ్
విషానులేపో రుధిరం మృతశ్చ స్వప్నస్యగమ్యం గమనంచధన్యమ్.
స్వప్నాధ్యాయమిదం పుణ్యం ప్రాతరుత్థాయయః పఠేత్
సుస్వప్నం లభతే సోపిబృహస్పతి వచోయథా.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత మంచిదిగాదు. తప్పులున్నవి శైథిల్యము గలదు. గ్రంథపాతములు లేవు.

ఎట్టి స్వప్నములు మంచి ఫలము నొసఁగునో ఎట్టివి చెడ్డఫలము నొసఁగునో ఇందు వివరింపఁబడినది. సంస్కృతశ్లోకములకు తెలుఁగు టీక యిందుఁ గలదు.

గ్రంథాంతమున అభ్యంగనమునకు, విద్యాభ్యాసమునకు, ప్రయాణమునకు, ప్రకారాంతరమున స్వప్నమునకు మంచిచెడ్డలు తెలుపు పద్యములు రెండు పుటలలోఁ గలవు.

---

## No. 2397. స్వరచింతామణి.

## SVARACINTĀMAṆI.

Substance, paper. Size, 12¼ × 8¼ inches Pages, 143 Lines, 20 on a page Character, Telugu Condition, fair. Appearance, old. Mode of writing fair, but not free from mistakes.

Begins on fol 1*a*. The other works herein are :—78*a* Sārasangraha Ganitamu, 102*a* Kāmakalānidhi, 130*b* Kalāpūrnōdayamu, 249*a* Bhāskara Śatakamu (Satīkamu), 287*a* Vēmanapadyamulu.

Incomplete.

A work on the science of prognostication according to the nature of breathing It contains the Sanskrit original, which is in the form of a conversation between Śiva and Pārvatī, together with the Telugu meaning.

**Beginning :**

శ్లో. సర్వేశం సర్వగం సర్వం సర్వభూతహృదిస్థితమ్
సర్వకార్యకరం నత్వా సర్వజ్ఞానముదీరితమ్.

టీక. అందఱికి ఈశుండై సకలభూతముల హృదయమందు ఉండి సర్వకార్యముల హృదయమందు ఉండి సర్వకార్యములు హృదయమందు ఉండి సర్వకార్యములుచేసే స్వామికి నమస్కరించి సకల జ్ఞానమున్ను తెలియఁదగినది.

యస్మాదుత్పద్యతే విశ్వం పునర్యస్మిన్ విలీయతే
తమహం శాశ్వతం వందే సమీరణపదానుగమ్

టీక. ఎవరివల్ల లోకం పుట్టి తిరుగా యెవరియందు అడుగుతున్నదో శాశ్వతంబుగా ఉండే వాయుమార్గ సంచారుడయిన దేవునికి నేను నమస్కరిస్తున్నాను.

అవ్యక్తమవ్యయం శాంతం నితాంతం యోగినాం ప్రియమ్
సర్వానందస్వరూపం చ తం వందే బ్రహ్మ సర్వగం.

తెలియకూడని నాశరహితుండై యోగీశ్వరులయిన వారికి మిక్కిలి ప్రియుండై సర్వానందస్వరూపుండై సర్వసంచారుండైన బ్రహ్మను గూర్చి నమస్కరిస్తున్నాను.

**End :**

ఆగతంతు యథాకాలం విఘ్నరూపేణ భామిని ।
తస్మాదద్యోపద్రవాశ్చ గ్రహపూజా మశివార్చనైః.

ఈ రీతిని విఘ్నరూపముగావచ్చె ఆయుఃకాలానికి చూచితిరే నిమిత్యం ఔషధములు దానం జపహోమం శివపూజాదులు వీనిచేత పరిహరించుకొనేది.

**Colophon :**

ఇత్యుమామహేశ్వర సంవాదే స్వరచింతామణౌ పౌష్టికాలచంద్రసూర్యాతిచారో నామ త్రయోదశోధ్యాయః పౌష్టకాలాధ్యాయః సంపూర్ణః.
(వి-వి.)—

అసమగ్రము. వ్రాంత నంచిది. తప్పులు కొలఁ గలవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

శ్వాసప్రచారము ననుసరించి ప్రశ్నఫలములను దెలుపు ప్రశ్నశాస్త్ర గ్రంథమిది. ఇందు ప్రశంసన, పిండోత్పత్తి, స్వరోత్పత్తి, కాలప్రమాణసాంఖ్యనాడీసంధి, స్వరకర్మ, సాధారణప్రశ్న, వాతస్వరవిధిజ్ఞానతత్త్వజ్ఞానమూలస్వరధాతుమూలజీవచింతా, జలక్రీడా, భోజనతాంబూలవిధి, సంభోగ, గర్భజ్ఞాన, రోగ, యుద్ధ, వృష్టిలక్షణ, సస్యోత్పత్తి, అర్ఘ, ఆఖేట, పౌష్టికాల, కాలవిజ్ఞాన స్వప్నవిషయకములయిన ఆయాశ్వాసములు ఇర్వదిరెండుగా విభజింపఁబడినది సంస్కృత మూలశ్లోకములును వానికిఁ దెలుఁగు టీకయు నిందుఁ గలదు. సంస్కృతము ఉమామహేశ్వరసంవాదాత్మకముగా నున్నది.

ఇందలి గ్రంథాంతరములివి :—

78a సారసంగ్రహగణితము, 102a కామకళానిధి, 130b కళాపూర్ణోదయము, 249a భాస్కరశతకము (సటీకము), 287a వేమనపద్యములు.

---

## No. 2398. స్వరచింతామణి (సటీకము).

### SVARACINTĀMANI.

Substance, palm-leaf. Size, 10⅝ × 1⅜ inches. Pages, 16. Lines, 5 on a page. Character, Telugu. Condition, slightly injured. Appearance, old. Mode of writing, fair but not free from mistakes.

Incomplete.

This explains how good or bad events can be foreseen according to

**Beginning :**

అన్యద్రహస్యం వక్ష్యామి శ్రుణు దేవి యథాక్రమమ్
సర్వజ్ఞానం సమగ్రం వా భూబలోన్యాదికారణమ్.

టీక. ఈశ్వరుడు గౌరీదేవికి చెప్పిన శాస్త్రము భూబలానకు మొదటి కారణం గాను జ్యోతిషశాస్త్రమందుల రహస్యము చెప్పేను.

దైవజ్ఞానం వినా రాజ్యం వినామూలేనయత్త్రరమ్
వినా స్నేహేన యజ్జ్యోతిః వినాభావేన కామిని
తస్మాద్దైవజ్ఞవిజ్ఞానం సంక్షేపేన వదామ్యహమ్
దేవతా గురుభక్తశ్చ సుశీలశ్చ సుభావనః.

**End :**

జీవస్థానే చిరాయుష్య మల్పాయు స్సూన్యర్య మేవచ
పుణ్యద్రణంచయేదేవి దికిత్సం మాతఃక్షణమ్ (?)

ఆయుష్యంగల ప్రాణియగునా యని అడిగితేను పూర్ణస్థానమందుండి అడిగితేను ఆయుష్యంగలవారు. శూన్యస్థానమందు ఉండి అడిగితేను అల్పాయుష్యం ఆ ప్రాణికి శుభాశుభాలు మాతలక్షణాలు యెరింగేది శుభగణాలాయెనా శుభమగును. లేకుండెనా అశుభమగును.

(వి-వి.) —

అసమగ్రము. వ్రాత మంచిదిగాదు. తప్పులమయము. గ్రంథపాతములు లేవు.

సూర్యచంద్రనాడీప్రచారములబట్టి శుభాశుభముల గుర్తించు తెలుఁగిందు కలదు.

---

## No. 2399. స్వరశాస్త్రమంజరి.

## SVARAŚĀSTRAMAÑJARI.

Substance, palm-leaf. Size, 7¼ × 1¼ inches. Pages, 99. Lines, 6 on a page. Character, Telugu Condition, fair. Appearance, old Mode of writing, fair, but not free from mistakes.

Begins on fol 1*a*. The other work herein is 51*a*. Saptaprakaranamu.

Complete.

This is a Telugu rendering of the Sanskrit work which explains how good or bad events can be foretold according to the position of the sun and the moon.

**Beginning :**

శ్రీశివానందుఁడై శివ యోగమునను
శివరాత్రి వెలయంగఁ జేయుచునుండె
ఆరాత్రి జనులు సమాధి యోగులను
స్వరశాస్త్రయోగంబు సరిగాఁగ దలఁచి
హరమతసారంబు హరిశాస్త్రమతము
అజపయోగంబును నధ్యాత్మమతము
వాసిష్ఠమునిచంద్రు వనితయోగంబు
శానానుతంబును నవధానయుతము
మహితమయ్యెడు నట్టి మార్తాండమతము
కడునొప్పుచున్న విక్రమసింహమతము
కొమరొప్ప వెలసిన గోరక్షమతము
కడుఁ జిత్రమగునట్టి కామాక్షిమతము
మొదలుగా మహిమీఁద ముఖ్యమైయున్న
యోగశాస్త్రములెల్ల యోజించిచూచి
జీవహేతువుగాఁగ జీవునిఁ బట్టి
తెలుఁగొప్ప జనులెల్లఁ దెలియునట్లుగను
స్వరశాస్త్రమంజరి వర్ణింతుఁ బ్రీతి
ఆదిమధ్యాంతంబు లవి యెట్టివనిన

**End :**

సంక్రాంతి సిద్ధులు చతురులు సూడ
ముక్కోద పెదవిరా వాక్కు నుడి పుట్టి
స్వరభూమిభూమికి సత్యంబు సాక్షి
ముక్కుమూల చక్కికి వాక్కు నుడి పుట్టి
స్వరజలముకు సత్యంబు సాక్షి
ముక్కుకొగొటి బురవాక నుడె పుటి ?
స్వరమాకాశ సత్యంబు సాక్షి
ఈస్వర శాస్త్రంబు ఈశ్వర కరుణ
నెవనికి లభియించు నెవడభ్యసించు
నతనికి నిహపరం బఖిలంబు గలుగు.

గ్రంథాంతమందీ వ్రాఁతగలదు :—

"విరోధినామ సం॥ కార్తిక బ 2 శుక్రవారం యీ స్వరమంజరి పుదుచ్చేరిలో మాదేటి సర్వేశలింగం భాసాకు వ్రాసుకొనెను."

(వి-వి.)—

సమగ్రము. కృత్యవతరణిక లేదు. వ్రాంత మంచిది. తప్పులు చాలఁ గలవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

సూర్యచంద్రనాడీగతుల ననుసరించి జనులకు శుభాశుభ ప్రాప్తిని గుర్తించు తీరు లిందుఁ జెప్పబడినవి. సంస్కృతగ్రంథమున కిది తెలిఁగింపుము యుండును.

ఇందలి గ్రంథాంతరము :—

51, షష్ట్రప్రకరణము.